


# నేర్చుకొనుటకు పసితనం ప్రతిబంధకం కాదు

వంట చేయడం నేర్చుకొనుట పెద్దగా పెరుగ నేర్చుకొనుటలో ఒక విధానం మాత్రమే. పళ్లు, పసుచిగుళ్ల భద్రతపట్ల రోజూ శ్రద్ధ వహించవలసిన విషయం కూడ మీరు ఆమెకు బోధించాలి. ఆమె వృద్ధాంగన యైనప్పుడు, ఆమె పళ్లు అప్పటికీ చెక్కుచెదర కుండా, సహజంగా వుంటవి. మీ వివేకమును ఆమె సర్వదా స్మరించుకుంటూ, అసహ్యకరమైన దంతక్షయం మరియు నొప్పి, పసుచిగుళ్ల బాధల బారినుండి ఆమెను రక్షించినందుకు మీకు అభివందనాలు అర్పించుతుంది. మీ పిల్లలకు వారెప్పుడో నేర్చుకోదగిన అత్యుత్తమ అలవాట్లను ఈనాడే బోధించండి— ఫోర్‌హన్స్' టూత్‌పేస్టుతో రోజూ పళ్లు, పసుచిగుళ్లను తోముకుంటూ వుండుట. అమెరికా యందలి దంతవైద్యుడు ఆర్. జె. ఫోర్‌హన్‌చే నిర్మించబడిన ఫోర్‌హన్స్' టూత్ పేస్టు ఒక్కటే ఆరోగ్యవంతమైన గట్టి పసుచిగుళ్లు, మెరిసే తెల్లని పళ్లకు తగిన ప్రత్యేక ఓషధిపదార్థములు గలది. ఇప్పుడే ఈ మంచి తీర్మానం చేయండి। జీవితకాల మంతయూ అనుసరించే 'అలవాటును మీపిల్లలకు నేడే ప్రారంభించండి...అది రోజూ ఫోర్‌హన్స్' టూత్‌పేస్టును వాడుటయే. ఒక ఉచిత ప్రతి చిన్న రంగుల పుస్తకం "CARE OF THE TEETH AND GUMS" (ఇంగ్లీషులో) కోసం తపాలా ఖర్చుల నిమిత్తం 15 న.పై. తపాలా బిళ్లలను పంపండి. మెనర్స్' డెంటల్ ఎడ్వయిజరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం. 10031, బొంబాయి-1.

**COUPON**

**Please send me a copy of the booklet "CARE OF THE TEETH AND GUMS"**

*Name*.............................................

*Address*.............................................

C. I .............................................





ప్రత్యేకమైన
జారని సోల్స్

# Carona

కరోనా మాన్సూన్
జోళ్లను
సురక్షితమైనవిగా
చేస్తాయి!

కరోనా మాన్సూన్ జోళ్ళ క్రొత్తవైన జారని సోల్స్ గలిగి ధరించడానికి ఎంతో హాయిగా...ఎంతో సురక్షితంగా నుంటాయి! తడిగా నున్న రోడ్ల మీద నడవడానికి కష్టంగా వుండదు. కరోనా జోళ్ళు మన్నికైనవి కూడా! ఒక జత చాలా కాలం వస్తుంది. మీ కాళ్లకు సంపూర్ణ రక్షణ నిస్తుంది.

కుటుంబానికంతటికీ ఆనందాన్ని కలుగ జేయుటకు జోళ్ళు అనేక స్టయిల్స్‌లో దొరుకుతాయి! పురుషులకు కామెట్, మోహక్, వర్షబహార్ మరియు స్త్రీలకు బెల్లెరీనా లభిస్తాయి. మాన్సూన్‌లు సమీపిస్తున్నాయి. కనుక మీకు ఒక జత కొనుక్కోండి!

కామెట్ రూ. 8.50 పన్నులు అదనం.

## కరోనా సాహు కంపెనీ లిమిటెడ్

రిజిస్టర్డ్ ఆఫీస్ : 221, దాదాభాయినౌరోజీ రోడ్, బొంబాయి-1.

వర్షబహార్ రూ. 8.25.



బెల్లెరీనా రూ. 5.75 (నీలం)
రూ. 5.35 (నలుపు)



పన్నులు అదనం.

LPE Alyars. N-2A-TL A




## మీరు మృదువుగా వేపొరబ్ రాస్తే అది వెంటనే వెచ్చదనాన్నిచ్చి హాయిని గొలుపుతుంది... మీ పిల్లవాడు సులభంగా శ్వాసను పీల్చుకొని రాత్రంతా హాయిగా నిద్రపోతాడు.

బాధ నివారణకు మీ పిల్లవాడు మీ మీద ఆధారపడతాడు. అతడు రొంపతో బాధపడుతున్నప్పుడు విక్స్ వేపొరబ్ రాయండి. ఛాతీ గొంతుక, వీపు మరియు ముక్కుచుట్టుప్రక్కల మీ ప్రేమపూర్వక చేతులతో విక్స్ వేపొరబ్ మర్దన చేస్తే, మీ కళ్ల ముందే ముక్కుదిబ్బడ పోవడం ప్రారంభమవుతుంది. అతడు తిరిగి సులభంగా శ్వాసను పీలుస్తాడు. ఎందుకంటే ఔషధ ఆవిరులు ఏడు సెకండ్లలోనే జలుబు భారమున్న చోట్లకి చేరతాయి. అప్పుడు పిల్లవాడిని చక్కగా పడుపు మీద పడుకోబెట్టండి.

అతడు బాగా నిద్రపోతూంటే వేపొరబ్ రాత్రంతా పని చేస్తూంటుంది. తెల్లవారే టప్పటికి జలుబు భారమంతా పోతుంది. అతడు లేచేటప్పటికి హాయిగా, ఆరోగ్యంగా వుంటాడు.... ఆటలతో మురిపించే మీ ముద్దు బిడ్డ.




# విక్స్ వేపొరబ్

జలుబులకు ఈ రాత్రేరాయండి



స్కూలు జీవితానికి ప్రత్యేకంగా విధానింపబడినది—

బిన్నీ వారి **D. 380**

సరసమైన వెలకు చూడ్డానికి అందంగా ఉంటుంది. ఎంత చెడవేసుకున్నా బాగా మన్నుతుంది. మెర్సిరైజ్డ్ కావింపబడినది.

ఎన్నిసార్లు ఉతికినా రంగు దిగకుండా ప్రకాశవంతంగా ఉంటాయి.

వివిధ రకాలనుండి మీకు నచ్చినది తీసుకోండి. ఫర్నిషింగులకు కుషన్ కవర్లకు కూడా ఉపయోగకరంగా ఉంటుంది.

**బిన్నీ**-బట్టలకు పెట్టినది పేరు

బెంగుళూరు ఉల్లెన్, కాటన్ & సిల్క్ మిల్స్ కంపెనీ లిమిటెడ్ అగ్రహారం రోడ్డు, బెంగుళూరు 23 బిన్నీ & కో లిమిటెడ్ వారి అంగసంస్థ

---

"చిన్న మొత్తాలతో పొదుపు చేయండి"

# అందరూ తప్పు నాదే అన్నారు

కుటుంబములో అందరూ నా ఉద్యోగము పోవడానికి తప్పు నాదే అన్నారు. కాని ఆస్తమానమూ ఎంతో అలసటగా ఊదురోమవి ఉంటే నేను మాత్రము ఏమి చేయగలను?







మా ఆవిడ నన్ను హార్లిక్స్ త్రాగమంది. హార్లిక్స్ నాకు పూర్వపు శక్తి ఉత్సాహమూ తిరిగి కలిగిస్తుందని అంది



ఆమె అన్నది నిజమే! హార్లిక్స్ త్రాగిన కొన్ని వారాల్లోనే నా అలసట పోయింది. నా కొత్త ఉద్యోగములో ఉత్సాహముతో పనిచేస్తాను!




పూర్తిగా పోషణలేని కారణముగా నిరుత్సాహముగా ఉంటే డాక్టర్లు హార్లిక్స్‌ను సిఫార్సు చేస్తారు. పూర్తి మీగడ గల పాలను తోడు గోధుమపిండి, మాల్టెడ్ బార్లీల పోషకవంతమైన సారముతో హార్లిక్స్ రుచిగా ఉంటుంది. తప్పకుండా పనిచేస్తుంది!

## హార్లిక్స్

*అదనపు శక్తిని కలిగించును!*

" ఓ!
అదినావంతు
ప్యారీ
మిఠాయిలు "

అందరూ
పంచుకోండి.
అనుభవించండి.
ప్యారీ
మిఠాయిలతో
జీవిత మెంతో
ఆనందము




—విశిష్టరకపు మిఠాయిలను తయారుచేయువారు

మీరు వాడారా : హెల్త్ ఫ్రూట్స్ ● జింజెర్ క్యాప్స్
లెమన్ బార్లీ. కోకోనట్స్ ● మిల్క్ టాఫీ

ప్యారీస్ కన్ఫెక్షనరీ లిమిటెడ్, మద్రాసు

JWT-PRS-3629

# ఏ వరునికీ నేను నచ్చలేదు! వనజా













ఒక మాసం తరవాత







అశోకా శాండల్‌వుడ్ ఆల్‌పర్పస్ పౌడరు దినస్నానానంతరం శరీరమంతా చల్లుకొనుటకు - శరీరమును చల్లగా ఉంచి కళకళలాడేట్లు చేయును. చర్మవ్యాధులను నిరోధించును. అశోకా శాండల్‌వుడ్ టాల్కం పౌడర్ దినమూ టాయిలెట్‌గా అలంకరణ సాధనముగా ఉపయోగించండి. అశోకా శాండల్‌వుడ్ ఫేస్ పౌడర్ అందమయిన ప్లాస్టిక్ డబ్బాలలో దొరుకును. అది వ్యానిటీ బాగ్‌లో ఉంచుకుని అప్పుడప్పుడు ముఖమునకు, చేతులకు అద్దుకొనిన అది చెమటను గ్రహించి ముఖమును ఎంతో కాంతివంతముగా సౌరభపుష్పంవలె నుంచును. మరియు మనోహరదాయకమైనది ఎల్లప్పుడూ వాడండి.

తయారు చేయువారు. **విజయా కెమికల్స్** మద్రాసు-7.

STUDIO Keshav



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

గత సంచికతో "రామాయణం" పూర్తి అయింది. దాని స్థానంలో ఈ సంచిక నుంచీ "కృష్ణావతారం" కథ రంగుల బొమ్మల సీరియల్‌గా వెలువడుతున్నది. కృష్ణుడికి సంబంధించిన కథ మనకు హరివంశం, భాగవతం, భారతం మొదలైన అనేక పురాణాలలో కాన వస్తుంది. అవతారా లన్నిటిలోకీ కృష్ణావతారం కథే చాలా విపులమూ, సమగ్రమమూ అయినది. ఈ కథను "చందమామ" పాఠకులకు నెలనెలా అందిస్తాము.

సంపుటి 39 సెప్టెంబర్'66 సంచిక 3

CHITRA



# భారత చరిత్ర



దక్కను

మొగలు సామ్రాజ్యంలో ఒక పరగణాగా ఉండిన దక్కనుసుబా నిజాముల్‌ముల్క్ కింద స్వతంత్ర రాజ్యమయింది.

బహదుర్‌షా హయాంలో ఇతను రెండు సార్లు ఉద్యోగం చేసి, ఆ తరవాత ఫ్రరుఖ్‌సియార్ చేత 1713 లో దక్కను గవర్నరుగా నియమించబడి, నిజాముల్‌ముల్క్ బిరుదు పొందాడు.

ఇంతలో ఫ్రరుఖ్‌సియార్ పరిపాలన అంతమయింది. నిజాముల్‌ముల్క్‌ను మాల్వాకు పంపారు. ఇక్కడనే అతను తన భవిష్యత్తుకు దోహదం చేసుకున్నాడు. ఇతని వైఖరి సయ్యిద్‌లకు నచ్చక ఇతన్ని బదిలీ చేస్తూ ఉత్తరువులు జారీ చేశారు. ఈసారి అతను ఉత్తరువులను ఉల్లంఘించి, తన పైన కత్తిగట్టిన సయ్యిద్‌లను హతమార్చాడు.

1720 అంతంలో దక్కను తిరిగి నిజాముల్‌ముల్క్ అధీనంలోకి వచ్చింది. ఢిల్లీ దర్బారులో వుండే అమీన్‌ఖాన్ అనే వజీరు చనిపోగా, నిజాముల్‌ముల్క్‌కు ఆ పదవి ఇచ్చి, అతన్ని 1722 ఫిబ్రవరిలో ఢిల్లీకి పిలిపించారు. ఢిల్లీదర్బారు వాతావరణం చాలా కలుషితంగా ఉన్నది. పాదుషా అంతరంగికులు అతని సలహాలు వినక పోగా అతనిపై పాదుషాకు చాడీలు చెప్పారు. ఇది చూసి విసిగిపోయి అతను, 1723 డిశంబరు మూడో వారంలో పాదుషాకు చెప్పకుండా దక్కనుకు బయలుదేరాడు.

చెప్పుడుమాటలు విని పాదుషా, అతను తనపై తిరుగుబాటు చేస్తున్నాడని నమ్మి, హైదరాబాదు గవర్నరయిన ముబారిజ్‌ఖాన్‌కు, నిజాముల్‌ముల్క్‌ను యుద్ధంతో ప్రతిఘటించమని ఉత్తరువు పంపాడు. గెలిస్తే దక్కనుకు వైస్రాయి అవుతానన్న

60. మొగలుసామ్రాజ్య విచ్ఛిత్తి: స్వతంత్ర ముస్లిమురాజ్యాలు

ఆశతో ముబారిజ్‌ఖాన్ నిజాముల్‌ముల్క్‌తో 1724 అక్టోబరు 11న బిరారులో యుద్ధం చేసి, నిజాముల్‌ముల్క్ చేతిలో చచ్చాడు. పాదుషా నిజాముల్‌ముల్క్‌ను తుద ముట్టించలేకపోగా అతన్ని దక్షిణదేశాని కంతకూ వైస్రాయిగా గుర్తించి, అతనికి అసఫ్‌జాహ్ అన్న బిరుదు కూడా ఇవ్వ వలసివచ్చింది. అసఫ్‌జాహీలే చివరిదాకా నిజాము రాష్ట్రాన్ని పరిపాలించారు. హైదరాబాదు స్వతంత్ర సంస్థానం కావటానికి ఇదే నాంది. 1748 మే21న, 91వ ఏట నిజాముల్‌ముల్క్ మరణించాడు.



*బెంగాల్*

1705 లో బెంగాలు గవర్నరుగా నియమించబడిన ముర్షిద్‌కులీఖాన్ బలవంతుడూ, సమర్థుడూనూ. అతను బెంగాలు రాజధానిని ఢాకా నుంచి ముర్షిదాబాదుకు మార్చాడు. 1727 లో ఇతని మరణానంతరం ఇతని అల్లుడు షుజాఉద్దీన్‌ఖాన్ గవర్నరయాడు. ఇతని హయాంలోనే బిహారుసుబా బెంగాలుసుబా దాకా విస్తరించబడింది. అలివర్ది అనేవాడు బిహారుకు పాలకుడుగా నియమించబడ్డాడు. 1739 లో షుజాఉద్దీన్‌ఖాన్ చనిపోయి అతని కొడుకు గవర్నరు కాగా, అలివర్ది మరికొందరితో చేరి కుట్రచేసి బెంగాలు గవర్నరును హత్య చేసి, బెంగాలును ఆక్రమించాడు. అతను బెంగాలును స్వతంత్రంగానే పాలించసాగాడు. మంచి పాలకు డనిపించుకోదగిన లక్షణా లతని కున్నాయి.

అయితే అలివర్ది పరిపాలన సుఖంగా సాగలేదు. ఏటా మహారాష్ట్రులు బెంగాలుపైన దండయాత్ర చేస్తూవచ్చారు. ఇతని కింద ఉండిన అఫ్ఘాన్ సేనానులూ, బిహారులోని వాళ్ళూ ఏకమై కుట్ర చేసి, తిరుగుబాటు చేసి ప్రమాదం తెచ్చిపెట్టారు.

అలివర్ది మహారాష్ట్రుల ధాటికి తట్టుకోలేక ఏటా వారికి 12 లక్షలరూపాయల చౌథ్

చెల్లించే షరతు మీద వారితో ఒడంబడిక చేసుకున్నాడు. ఒరిస్సా నుంచి తనకు వచ్చే రాబడిలో కొంత భాగం కూడా అతను వారికి ఇచ్చాడు. 1756 ఏప్రిల్‌లో ఇతని మరణానంతరం ఇతని మనమడు నవాబ్ సిరాజుద్దౌలా (అసలు పేరు మీర్జామహమ్మద్) బెంగాలు పాలకు డయాడు. ఇతని పరిపాలన కొద్దికాలమే సాగినా, అది బెంగాలు చరిత్రలోనూ, భారత చరిత్రలోనూ కూడా ఒక ముఖ్యమైన మలుపుగా పరిణమించింది.

ఔధ్ (అవధ్)

ఔధ్‌సుబాలో ఈ నాటి ఔధ్ మాత్రమే గాక, దానికి తూర్పుగా ఉండే వారాణసి కూడా చేరి ఉండేది. అలహాబాదు, కాన్పూరు పరిసరాలు కూడా అందులో చేరి ఉండేవి. ఔధ్ రాజ్యాన్ని స్థాపించిన సాదత్‌ఖాన్ అనేవాడు ఖరాసాన్ నుంచి వలస వచ్చాడు. 1724 లో ఔధ్ గవర్నరుగా నియమించబడి, శీఘ్రకాలంలోనే విశేష ఖ్యాతి సంపాదించాడు. నాదిర్‌షా దాడి జరిగిన సమయంలోనే ఇతన్ని ఢిల్లీకి రప్పించారు. ఆ యేడే అతను ఆత్మహత్య చేసుకున్నాడు.

అతని అనంతరం అతని అల్లుడు సఫ్దర్‌జంగ్ ఔధ్‌కు గవర్నరయాడు. 1748 లో ఇతన్ని ఢిల్లీలో వజీరుగా నియోగించారు. 1754 లో చనిపోయే ముందు దాకా ఇతను సమకాలీన భారతచరిత్రలో ప్రముఖ పాత్ర నిర్వహించాడు. ఇతన్ని నిజాముల్‌ముల్క్ కొడుకూ, మనమడూ ప్రతిఘటిస్తూ వచ్చారు.

సఫ్దర్‌జంగ్ అనంతరం ఇతని కొడుకు షుజాఉద్దౌలా ఔధ్‌ను సమర్థవంతంగా పరిపాలించి, తాను కూడా ఢిల్లీలో వజీరుగా నియమింపబడి, ఉత్తర భారతదేశ చరిత్రలో ప్రముఖ పాత్ర నిర్వహించి, 1775 లో చనిపోయాడు.



# నేహ్రూ కథ

## 27



1928 ఆఖరులో కలకత్తా కాంగ్రెసు మహా సభ జరగనున్నది. దానికి మోతీలాల్ నేహ్రూ అధ్యక్షత వహిస్తున్నాడు. అఖిల పక్ష సమావేశం తరఫున ఆయన తయారు చేసిన రిపోర్టు సమావేశంలో ఆమోదించబడవలసి ఉన్నది. దానికి జవాహర్ పూర్తిగా వ్యతిరేకి. ఆ రిపోర్టులో భారత స్వాతంత్ర్యం ప్రసక్తి లేదు సరిగదా, పూర్తి డొమినియన్ స్టేటను కావాలని కూడా లేదు. తండ్రి కొడుకుల రాజకీయ దృక్పథాలు లోగడ అనేకసార్లు వ్యతిరేకించటం జరిగింది. కాని ఈ సారి వారి మధ్య ఉండినంత వైరుధ్యం పూర్వ మెన్నడూ లేదు.

తన రిపోర్టును ఆమోదించని పక్షంలో తాను కాంగ్రెసుకు అధ్యక్షత వహించేది లేదని మోతీలాల్ తెలియబరిచాడు. ఈ రిపోర్టు కారణంగా కాంగ్రెసు రెండు వర్గాలుగా చీలే లాగు కనబడింది. రెండు పక్షాల మధ్యా చర్చలూ, రాజీ బేరాలూ సాగాయి. చివరకు రాజీ కుదిరింది. కాంగ్రెసు నేహ్రూ రిపోర్టును ఆమోదిస్తుంది, కాని ఒక ఏడాది లోపల అందులో వివరించిన రాజ్యాంగాన్ని బ్రిటిషు ప్రభుత్వం ఆమోదించకపోతే కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్య లక్ష్యాన్ని చేబట్టుతుంది.

ఈ రాజీ పద్ధతిని జవాహరు వ్యతిరేకిస్తూ బహిరంగ సమావేశంలో మాట్లాడాడు. కాని ఒక విధంగా ఈ రాజీ తీర్మానాన్ని అతను కూడా అభినందించవలసి వచ్చింది. ఏమంటే, దీని మూలాన కాంగ్రెసులో చీలిక రాకుండా పోయింది; బ్రిటిషు ప్రభుత్వం ఎలాగూ అఖిలపక్ష రాజ్యాంగానికి ఏడాది లోగా సమ్మతించబోదు. 1930 వచ్చే సరికి కాంగ్రెసు ఉద్యమం ప్రారంభించటానికి ఈ రాజీతీర్మానం అవకాశం కలిగించింది.



ఇదే సమయంలో మీరట్ విచారణలు ఆరంభమయాయి. చరిత్ర ప్రసిద్ధమైన ఈ మీరట్ కేసుకు వెనక ఉండినది కార్మికోద్యమమూ, ఉద్యమకర్తలూనూ.

1928, 1929 సంవత్సరాలలో కార్మికులలో అశాంతి చెలరేగింది. వారి పరిస్థితి చాలా హీనదశకు వచ్చింది. అంతకు పూర్వం అయిదారేళ్ళ పాటు పారిశ్రామికులు అధిక లాభాల ద్వారా కోట్లు గడించి కూడా కార్మికులను హీనస్థితిలో ఉంచారు. ఇంతలో పరిశ్రమలలో మాంద్యం ఏర్పడింది. అందుకు శిక్ష పొందినవారు కార్మికులు. బొంబాయి జౌళి పరిశ్రమలలోనూ, బెంగాలు నార పరిశ్రమలలోనూ పనిచేసే వారు చైతన్యం పొంది సమ్మెలు చేశారు.

భారతదేశంలో కార్మికోద్యమం అప్పుడప్పుడే బలపడుతున్నది. కలకత్తా కాంగ్రెసు సమావేశానికి ముందు జవాహరు ఝరియాలో జరిగిన అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు సమావేశానికి వెళ్ళి, కార్మికోద్యమాన్ని నడిపే వారిలో మితవాదులూ, ప్రగతివాదులూ ఉన్న సంగతి కనిబెట్టి, ప్రగతివాదుల వైపే మొగ్గాడు. ఈ ప్రగతివాదులు చాలావరకు కమ్యూనిస్టులూ, అర్ధ కమ్యూనిస్టులూనూ. బొంబాయిలోని గిర్నీకామ్‌గార్ యూనియన్, జి. ఐ. పి. రైల్వేయూనియన్ లాటి కార్మిక సంస్థలు వీరి ప్రభావానికి గురి అయాయి.

1929 లో అకస్మికంగా ప్రభుత్వం కార్మికనాయకులలో ప్రముఖులైన వారిని అరెస్టు చేసింది. వీరి విచారణే మీరట్ కేసు. మీరట్ ముద్దాయిల పక్షాన వాదించటానికి ఒక కమిటీ ఏర్పాటయింది. దానికి మోతీలాల్ అధ్యక్షుడు. అందులో డా. అన్సారీ, జవాహర్ మొదలైనవాళ్ళు సభ్యులు. ఈ కమిటీ చాలా భారమైన పని తలపెట్టింది. కమిటీ సభ్యులు నెలల తరబడి మీరట్‌లో కూర్చోవటం సాధ్యం

కాదు. ముద్దాయిల తరఫున వాదించటానికి వకీళ్ళు కావాలి. తమ ఫీజు పూర్తిగా ముట్టితే గాని ప్లీడర్లు లభించేటట్టు కనిపించ లేదు. డబ్బుకావాలి. కష్టపడి డబ్బు సేక రించి ముద్దాయిల పక్షాన వకీళ్ళను పెట్టినా తీర్పు మరొకలా ఉండబోతుందన్న ఆశ ఏమీ లేదు.

ఆ రోజులలో గాంధీజీ రాజకీయాలు పట్టించుకోకుండా దేశం నాలుగు మూలలూ పర్యటించి, ఖాదీ ప్రచారం చేస్తూ దేశాన్ని క్షుణ్ణంగా పరిచయం చేసుకున్నాడు. ఆయన "దరిద్రనారాయణుడి" కోసం చందాలు పోగు చేశాడు. గాంధీజీలో జవాహరుకు బొత్తిగా నచ్చని వాటిలో ఈ "దరిద్రనారాయణ" ఆరాధన ఒకటి.

ఒక వంక దేశంలో రాజకీయ పరిస్థితి తీవ్రమవుతూ ఉంటే గాంధీజీ, అముఖ్య మైన ఖాదీ ప్రచారం సాగిస్తున్నాడన్న అభ్యంతరం అటుంచి, దారిద్ర్యాన్ని ఆరా ధించటం జవాహరుకు ఎంతమాత్రమూ సరిపడేది కాదు. దారిద్ర్యాన్ని క్షమించ రాదు. దాన్ని పెంపొందించే వ్యవస్థను మార్చాలి. అందుకు తగిన ధైర్యసాహసాలు లేని వాళ్ళే, దారిద్ర్యాన్ని ఆరాధిస్తారు. ఐశ్వర్యమూ, దారిద్ర్యమూ అనివార్యమైన




వనే వాళ్ళ నమ్మకం. అందరికీ చాలినన్ని వినియోగ వస్తువులు ఉత్పత్తి కావచ్చునని వారు ఊహించలేరు. ఈ విషయం జవాహరు చాలాసార్లు ప్రస్తావించినప్పుడు గాంధీజీ, ధనికులు పేదల తరఫున ధర్మ కర్తలుగా పని చేయాలంటూ వచ్చాడు. ఈ సాంఘిక సమస్య ఆ విధంగా పరిష్కార మవుతుందని జవాహరుకు ఎంతమాత్రమూ నమ్మకం ఉండేది కాదు.

ఈ సమయానికి శాసనసభలు చప్పబడి పోయాయి. వాటికి నిజమైన అధికారం ఏదీ లేదు. వారు చేయగలది అంతకన్నా లేదు. శాసనసభలు సమ్మతించక పోయినా పాల

కులు తాము తీసుకునే చర్యలను అర్డి నెన్సుల ద్వారా అమలు చేసుకుంటున్నారు.

ఇలా మండకొడిగా ఉన్న కేంద్రంలోని శాసనసభలోకి భగత్సింగూ, దత్తూ ప్రేక్షకుల గాలరీలో నుంచి రెండు బాంబులు విసిరి చైతన్యం కలిగించారు. ఆ బాంబులు ఎవరినీ అంతగా గాయపరచలేదు, అవి హాని చెయ్యటానికి వేసినవి కూడా కావు.

ఈ బాంబులతో కొంత ఉగ్రరిష్టు చైతన్యం దేశంలో బయలుదేరింది. లాలా లజ్పతిరాయిని కొట్టిన ఇంగ్లీషు పోలీసు అధికారిని లాహోరులో కాల్చి చంపారు. బెంగాలులోనూ, ఇతర ప్రాంతాలా ఇలాటి చర్యలు సాగాయి. ప్రభుత్వం అధిక సంఖ్యలో డిటిన్యూలను విచారణ లేకుండా జైళ్ళలోకి తోసింది. చాలామంది ఖైదీలు నిరశనవ్రతం పట్టారు.

నిరశన ప్రారంభమైన నెలరోజులకు జవాహరు లాహోరులో ఉండటం తటస్థించింది. అధికారుల అనుమతితో ఆతను భగత్సింగునూ, జతీంద్రనాథ్ దాసునూ చూశాడు. భగత్సింగ్ ఆకర్షణీయుమైన, తెలివిగల వ్యక్తిగానూ, శాంతస్వభావుడుగానూ జవాహరుకు కనిపించాడు. జతీంద్రనాథ్‌దాస్ 61 రోజుల ఉపవాసం అనంతరం మరణించాడు. ఈ చావుతో జైలు నిబంధనలలో కొంత మార్పు వచ్చింది.

1929 ఆఖరులో జరుగనున్న లాహోరు కాంగ్రెసు సమావేశానికి గాంధీజీని అధ్యక్షుడుగా ఎన్నుకోవటానికి రాష్ట్ర కమిటీలన్నీ నిశ్చయించాయి. ఎందుచేతనంటే, త్వరలోనే దేశవ్యాప్తంగా ఉద్యమం సాగే సూచన లున్నాయి. దాని కెలాగూ గాంధీజీ నాయకత్వం వహిస్తాడు. కాంగ్రెసు అధ్యక్షత కూడా ఆయనకే ఉండటం ఉచిత మనుకున్నారు. అయితే గాంధీజీ అందుకు నిరాకరించి, ఆ పదవి జవాహరు కివ్వమని సూచించాడు.





# పాతాళదుర్గం

## 5

[రాకుమారి కాంతిసేనను ఎత్తుకుపోయిన కుంభీరు డనే రాక్షసుడు, కొండప్రాంతం చేరి, కాలశంబరు డనే మాంత్రికుడి వల్ల గాయపడ్డాడు. చెట్టు మీదినుంచి ధూమకసోమకులు యిదంతా గమనించారు. హఠాత్తుగా ఎక్కణ్ణుంచో ఒక బాణం వచ్చి, శంబరుడికి తగిలింది. ఆ వెంటనే అతడూ, రాక్షసుడూ గుహల్లోకి పరిగెత్తారు. తరవాత—]

కదంబ సైనికులు కొందరు, "అడుగో, రాక్షసుడు! అడుగో, రాక్షసుడు!" అని కేకలుపెడుతూ గుహల కేసి పరిగెత్తుకు రావటం, చెట్టు మీద వున్న ధూమక సోమకులు చూశారు. శత్రువుల కంటబడకుండా వుండేందుకు వాళ్ళిద్దరూ మరింత గుబురుగా వున్న చెట్లకొమ్మల్లోకి ఎగబాకారు.

"రాక్షసు డెక్కడ? వాడు పారిపోకుండా చుట్టుముట్టండి!" అంటూ ఒక అశ్వికుడు కత్తి ఝళిపిస్తూ సైనికుల మధ్యకు వచ్చాడు. అతడు కదంబరాజు ఉగ్రసేనుడు. అతణ్ణి చూస్తూనే సోమకుడు పళ్ళుకొరికి బాణం ఎక్కుపెట్టబోయేంతలో, ధూమకుడు అతణ్ణి వారిస్తూ, చెవిలో మెల్లిగా ఏమో చెప్పాడు. అంతలో నలుగురైదుగురు కదంబ సైనికులు ఉగ్రసేనుడి దగ్గిరకు పరిగెత్తుకుంటూ వచ్చి, "మహారాజా! రాక్షసుణ్ణి మేం గాయపరిచాం.



ఇదుగో చూడండి, యిక్కడ భూమ్మీద నెత్తురు గుర్తులు. కాని, వాడు చీకట్లో ఏదో గుహలోకి పారిపోయాడు," అన్నారు.

ఉగ్రసేనుడు సైనికులు తెచ్చిన కాగడాలలో ఒకటి తీసుకుని గుహల ముందు పచ్చిక మీద వున్న రక్తపు మరకలు చూశాడు. అవి చాలా చోట్ల కనిపించినై.

"సేనానీ, యీ రక్తం అంతా చూస్తూంటే యిక్కడ ఏదో చిన్న యుద్ధం జరిగినట్టు కనబడుతున్నది. పగలు మనం యీ ప్రాంతాలనే గదా కుంతలదేశ మంత్రికొడుకునూ, అతడి మిత్రుల్ని వేటాడింది?" అన్నాడు ఉగ్రసేనుడు.

రాజు మాటలకు సేనానాయకుడు వణికిపోతూ, "అవును, మహారాజా! కుంతల మంత్రి కుమారుణ్ణీ, అతడి అనుచరులనూ చంపిన ధూమకుడూ, సోమకుడూ అనే ఖైదీలను మన సరిహద్దు కాపలా సైనికులు పట్టుకున్నది యిక్కడే! ఆ హంతకు లిద్దర్నీ మన దూతలు ఆ దేశపు రాజుగారి వద్దకు తీసుకుపోయారు," అన్నాడు.

"ఆ దూతలు యింతవరకు తిరిగి రాలేదు. మన మాటలు ఆ రాజూ మంత్రీ ఎంతవరకు నమ్మారో మనకు తెలీదు. ఏది ఏమైనా, యీ రాక్షసుడి బెడద ఒకటి వచ్చి అడ్డుపడింది కాని; లేకపోతే ఆ కుంతల దేశాన్ని ఒక్కవారం రోజుల్లో సర్వనాశనం చేసివుండేవాణ్ణి," అన్నాడు ఉగ్రసేనుడు పళ్ళుకొరుకుతూ.

సేనాని ఏమో అనబోయేంతలో దాపుల వున్న కొండవాగు ప్రాంతం నుంచి కలకలం వినిపించింది. ఉగ్రసేనుడు కత్తి పైకెత్తి, "రాక్షసుడు కొండవాగు దాటి కుంతల దేశంలో ప్రవేశించాడేమో వెతకండి. కొందరు, యీ గుహలన్నీ గాలించండి," అని సైనికులను ఆజ్ఞాపించాడు.

సైనికుల్లో కొందరు వాగు కేసి పరిగెత్తబోయేంతలో, వాగు వైపు నుంచి కొందరు





కుంతలదేశ అశ్వసైనికులు, భయంకరంగా కేకలుపెడుతూ వచ్చి, కదంబ సైనికుల మీద పడ్డారు. "ఇది అధర్మయుద్ధం! దొంగదాడి! నే నెవరో తెలుసా, ఉగ్రసేన మహారాజును!" అంటూ ఉగ్రసేనుడు సింహంలా గర్జించాడు.

"అంత గొప్ప మహారాజుకు, యీ కొండ గుట్టల్లో ఏం పని? అనుమతి లేకుండా వాగు దాటి కుంతలదేశంలో ప్రవేశించిన ప్రతి ఒక్కడూ మాకు శత్రువే. ప్రతి ఘటించకుండా లొంగిపొండి, లేకపోతే ప్రాణాలు దక్కవు," అంటూ కుంతల సైనికుల నాయకుడు కత్తిదూసి, 'గుర్రం మీది నుంచి కింది కురికాడు.

కదంబ సైనికులు తమ రాజు ముందు సోలుపుగా నిలబడి, ఈటెలు బారుచేశారు. కొందరు సాహసులు డాలూ కత్తితో ముందు కురికి, కుంతల సైనికులను ఎదుర్కొన్నారు. ఉగ్రసేనుడు తన రక్షణకై దడిలా నిల్చున్న సైనికులను హెచ్చరిస్తూ, కొంచెం వెనక్కుపోయి, ఒక రాతి మీద నిలబడి, వాగు కవతల యింకా శత్రు సైనికులేమైనా వున్నారేమో అని పరీక్షగా చూడసాగాడు.

కుంతల కదంబ సైనికుల మధ్య బాహా బాహి యుద్ధం భయంకరంగా సాగింది. కుంతల సైనికుల్ని కొండవాగు దాటేలా తరిమికొట్టాలని కదంబసైనికులు ప్రయత్నిస్తూంటే; కుంతలసైనికులు, వాళ్ళనూ వాళ్ళ రాజునూ చుట్టుముట్టి పట్టుకోవాలన్న పట్టుదలతో పోరసాగారు. అంతలో తూర్పు దిక్కు తెల్లనైంది. చెట్టుకొమ్మల్లో దాక్కుని వున్న ధూమక సోమకులకు, కొంచెం దూరంలో యుద్ధం చేస్తున్న రెండు పక్షాల సైనికులూ స్పష్టంగా కనబడసాగారు.

"సోమూ, యిదే మంచి అదను. ఆ పాపి ఉగ్రసేనుణ్ణి యమలోకానికి నువ్వు పంపుతావా? నన్ను పంపమన్నావా?" అన్నాడు ధూమకుడు.





సైనికులు తమ రాజు కేదో ప్రమాదం కలిగిందని తెలుసుకుని, ఒక్కసారిగా వెనుదిరిగారు. అది అదనుగా తీసుకుని కుంతల సైనికులు వాళ్ళను ఈటెలతో వెన్నుపోట్లు పొడవసాగారు. అంతలో వాగు వైపు నుంచి, ఒక కంఠస్వరం గంభీరంగా వినిపించింది: "పారిపోయే శత్రువులను చంపవద్దు! చుట్టు ముట్టి బంధించండి!"

కుంతల సైనికులు వెనుదిరిగి చూశారు. మంత్రి గంగాధరుడు కొంతమంది అశ్విక సైనికులతో వేగంగా ఆ ప్రదేశానికి వస్తూ వాళ్ళకు కనిపించాడు. జై జై నినాదాలు మార్మోగినై. కదంబసైనికులు చుట్టుముట్టబడి నిరాయుధులు చేయబడ్డారు. రాజు ఉగ్రసేనుడు బాధతో నేల మీద అటూయిటూ దొర్లసాగాడు. గంగాధరుడు గుర్రం దిగి, సైనికులు దారి యివ్వగా, ఉగ్రసేనుణ్ణి సమీపించి, "ఎవ రీతడు? ఓహో, ఉగ్రసేన మహారాజుగారా? ఆశ్చర్యంగా వుంది. సభాభవనంలో కనకపు సింహాసనాన్ని అధిష్ఠించి వుండవలసిన వారు, ఈ అరణ్యం మధ్య నేల మీద పడి దొర్లుతున్నారేం?" అన్నాడు ఆశ్చర్యం నటిస్తూ.

గంగాధరుడి మాటలు వింటూనే, ఉగ్రసేనుడు లేచి కూర్చోబోయి బాధతో పెద్దగా

ధూమకుడు మాట పూర్తి చేసేలోపలే, సోమకుడు బాణం ఎక్కుపెట్టాడు. "కంఠానికి గురిచెయ్యి!" అని హెచ్చరించాడు ధూమకుడు.

సోమకుడు బాణం ఉగ్రసేనుడి కంఠానికి గురిచేసి వదిలాడు. కాని, అదే సమయంలో వాగు కవతల పెద్ద కలకలం బయలుదేరటంతో ఉగ్రసేనుడు అతృతగా నిల్చున్న రాతి మీది నుంచి కిందికి ఉరికాడు. సోమకుడు వదిలిన బాణం గురి తప్పి, రాజు కంఠంలో కాకుండా, భుజంలో బలంగా నాటుకున్నది. ఉగ్రసేనుడు కెవ్వమంటూ అరిచి కింద పడిపోయాడు. అతడి





యీ ప్రాంతాల జరిగిన విశేషాలు చెపుతూ వుండిపోయ్యాడు," అన్నాడు.

భద్రుడి పేరూ, అతడికి వెన్నులో తగిలిన బాణం సంగతీ వింటూనే, ఉగ్రసేనుడు పిచ్చివాడిలా నలుమూలలకూ చూడసాగాడు. ఆ క్షణంలో అతడికి ప్రాణభయం పట్టుకున్నది. తన కొడుకును చంపినందుకు, మంత్రి గంగాధరుడు తనను కత్తితో నిలువునా చీల్చివేస్తాడని అతడు వణికిపోసాగాడు. కాని, గంగాధరుడు చిరునవ్వు నవ్వుతూ ఒకడుగు ముందరకువేసి, ఉగ్రసేనుణ్ణి పట్టుకునివున్న సైనికులకు అతణ్ణి రాతి మీద కూర్చోబెట్టవలసిందిగా ఆజ్ఞాపించి, "మహారాజా, యింత పుత్రశోకంలో కూడా నేను తమకు హానితలపెట్టి మాత్రం యిక్కడకు రాలేదు. నా కుమారుడు శశికాంతుడి శవం కనబడేంత వరకూ, నేను అతడు మరణించాడంటే నమ్మను. అదే విధంగా జయంతుడూ బతికే వున్నాడనుకుంటున్నాను. మీ ద్రోహానికి వాళ్ళెప్పుడో తప్పక పగ తీర్చుకుంటారు," అన్నాడు.

ఉగ్రసేనుడు దీనవదనంతో, గంగాధరుడి కేసి చూస్తూ, "మహామంత్రీ! నిన్న ఉదయం నిద్రలేస్తూనే ఏ పాపిష్టిముఖం

మూలిగాడు. ఇద్దరు కుంతల సైనికులు ముందుకు వచ్చి, అతణ్ణి చేతులు పట్టుకు లేపి నిలబెట్టారు. సోమకుడు వదిలిన బాణం యింకా అతడి భుజంలో అలా గుచ్చుకునే వున్నది. గంగాధరుడు ఆ బాణం కేసి వేలు చూపుతూ, "మహారాజా! ఈ మాత్రానికే యింతగా బాధపడిపోతున్నారా? మీరు ప్రయోగించిన అంబు వెన్నులో తగిలినా లెక్కచేయకుండా మా భద్రుడు ముప్పైకోసుల దూరం ప్రయాణం చేసి, మా రాజధాని చేరాడు. రాజవైద్యుడు శస్త్రం చేసి అంబు బయటికి లాగుతూంటే, నవ్వుతూ నిన్న

చూశానే, అన్నీ కష్టాలే. ఇక్కడికి వేటకై వచ్చి, ఘోరాతిఘోరమైన పాపకార్యం చేశాను. రాత్రి నా కుమార్తెను......"

ఉగ్రసేనుడు మాట మధ్య ఆగి పోయాడు. మంత్రి గంగాధరుడు, ఉగ్రసేనుడు కూర్చున్న రాతికేసి ఒకడుగు వేసి, చప్పున వంగి, అక్కడ వున్న ఏదో ఒక వస్తువును చేతిలోకి తీసుకుని, దాన్ని పరీక్షించి చూస్తూ, "ఏమిటిది? ఎవడో రాక్షసుడి కొమ్ము! నెత్తురింకా ఎండిపోలేదు. యిక్కడి గుహల్లో రాక్షసులున్నారని నేనెన్నడూ వినలేదే!" అన్నాడు ఆశ్చర్యంగా.

ఉగ్రసేనుడు, గంగాధరుడి చేతిలో వున్న కొమ్ము కేసి చూస్తూ, "మహామంత్రీ! ఆ రాక్షసుడే రాత్రి నా కుమార్తెను కోటలో నుంచి అపహరించుకు పోయాడు. వాణ్ణి తరుముతూ నేనీ ప్రాంతానికి వచ్చాను. వాడితో నేను ముఖాముఖి తల పడింది లేదు. వాడి కొమ్ము ఎవరు తెగనరికి వుంటారు?" అన్నాడు నివ్వెరపోతూ.

ఉగ్రసేనుడి కుమార్తె అయిన కాంతిసేన అపహరణ గురించి గంగాధరుడు యింతవరకూ వినివుండలేదు. ఆ సంగతి వింటూనే అతడికి ఉగ్రసేనుడి మీద జాలి కలిగింది. వెంటనే అతడు తనతోపాటు



వచ్చిన వైద్యుణ్ణి దగ్గిరకు పిలిచి, ఉగ్రసేనుడి భుజంలో దిగివున్న బాణాన్ని చూపుతూ, "నీ చేతనైనంతలో మహారాజుకు బాధ లేకుండా, ఆ బాణాన్ని బయటికి లాగు," అని చెప్పి, ఉగ్రసేనుడితో, "మహారాజా! నా కుమారుడు గాయపడి యీ ప్రాంతాల ఎక్కడో దొరకవచ్చునన్న నమ్మకంతో, మా రాజవైద్యుడి శిష్యుణ్ణి వెంటబెట్టుకు వచ్చాను," అని చెప్పాడు.

యువవైద్యుడు క్షణాల మీద ఉగ్రసేనుడి భుజంలో దిగివున్న బాణాన్ని బయటికి లాగి, గాయానికి కట్టుకట్టాడు. గంగాధరుడు ఆ బాణాన్ని చూస్తూనే, ఆశ్చర్య

పోయి ఏమో అనబోయేంతలో, పక్కన వున్న సైనికనాయకుడు అతడితో రహస్యంగా ఏదో చెప్పాడు. గంగాధరుడు మరింత ఆశ్చర్యపోతూ, "మహారాజా! మిమ్మల్ని గాయపరిచినవాళ్ళూ, రాక్షసుడి కొమ్ము నరికినవాళ్ళూ ఒకరే. పితృభ్రాతృ హంతకులని, మీరు మా వద్దకు పంపిన ధూమకసోమకులకు, మా సరిహద్దు కాపలా నాయకుడు, మీ దూతల నుంచి తీసుకున్న బాణాలు యిచ్చాడు. ఇదిగో, చూడండి, మీ రాజచిహ్నం," అంటూ బాణాన్ని ఉగ్రసేనుడికి చూపించాడు.

"మహామంత్రీ! వాళ్ళిద్దరూ హంతకులవునో కాదో నాకు తెలియదు; కాని, ముమ్మాటికీ రాజద్రోహులు! వాళ్ళ ప్రాంతాలనే ఎక్కడో పొంచివుండి వుంటారు," అంటూ ఉగ్రసేనుడు తన సైనికుల కేసి తిరిగి, "ఆ రాజద్రోహుల్ని వెతకండి!" అని ఆజ్ఞాపించాడు.

గంగాధరుడు సైనికులను ఆగమని హెచ్చరించి, "మహారాజా! ఇక్కడ ఆజ్ఞలివ్వవలసినవాణ్ణి నేను, మీరు కాదు. నా కుమారుడైన శశికాంతుడు ఏమైనదీ తెలిసేవరకూ మీరంతా, శతభానుమహారాజుగారి బందీలు," అని చెప్పి కుంతల సైనిక నాయకుడి కేసి తిరిగి, "మన సైనికుల చేత యీ గుహలూ, అరణ్య ప్రాంతమంతా ఆ ధూమక సోమకుల కోసం వెతికించు. శతభాను మహారాజుగారు అభయమిచ్చారని మన సైనికులు కేకలు వేస్తూపోతే, వాళ్ళిద్దరూ దాగినచోటు నుంచి బయటపడవచ్చు," అన్నాడు.

ఆ వెంటనే ధూమక సోమకులు చెట్టు చితారు కొమ్మల మీద నిలబడి, "శతభాను మహారాజుకూ, జై!" అంటూ ఒక పెద్ద కేకపెట్టి, కొమ్మమీంచి కొమ్మ మీదికి కోతుల్లా ఎగిరి, నేల మీదికి ఒక్క దూకు దూకేశారు. —(ఇంకావుంది)





# క్రుద్ధముని శిష్యుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీ విలా శ్రమించటం చూస్తే జాలిగానే ఉన్నది గాని, ఒక వేళ ఇది నీ మంచికే కావచ్చు. కొందరు తమ మేలేదో, కీడేదో తెలుసుకోలేరు. ఇందుకు నిదర్శనంగా నీకు బ్రహ్మరాక్షసి అయిన చైత్రకుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

శిలావర్త మనే దేశాన్ని శృంగభుజు డనే రాజు పాలిస్తూ ఉండేవాడు. ఒకనాడు ఆ రాజు వద్దకు ఒక యాత్రికుడు వచ్చి, ఒక పెద్ద గింజను కానుకగా ఇచ్చి, "మహారాజా, నేను సముద్రం మీద ప్రయాణం చేస్తూండగా ఈ గింజ ఆకాశం నుంచి

## బేతాళ కథలు



నేనున్న ఒడలో పడింది. దీని సువాసన చూస్తే ఇదేదో దేవలోకపు చెట్టు తాలూకు విత్తు అయి ఉంటుం దనిపిస్తున్నది. దాని కాయ ఎలాటిదో ఊహించవలసిందే. ఈ విత్తును నాటి, చెట్టును పెంచి, దాని ఫలాలు అనుభవించడానికి మీబోటివారే అర్హులనుకుని దీన్ని మీకిస్తున్నాను," అని చెప్పాడు.

రాజు ఆ విత్తును స్వీకరించి తన తోటలో నాటించాడు. కొంతకాలానికి ఆ విత్తు నుంచి మొక్క మొలిచింది. క్రమంగా ఆ చెట్టు పెరిగి పెద్దదై, దానికి ఒకే ఒక పిందె పడింది. కాని అది పెరిగి కాయ అయే లోపునే ఎవరో దాన్ని కోసి, చితిపి, నేల పైన పడేశారు. ఈ సంగతి తెలిసి రాజు గారు తోటలో పని చేసేవాళ్ళను పిలిచి, వాళ్ళ అలక్ష్యానికి గట్టిగా చివాట్లు పెట్టాడు.

మరో మూడు మాసాల అనంతరం ఆ చెట్టుకు మరొక పిందె పడింది. పగలూ, రాత్రీ ఆ చెట్టుకు శ్రద్ధగా కాపలాకాస్తున్న తోటవాళ్ళకు ఒక రాత్రి ఒక విచిత్రమైన దృశ్యం కనపడింది. ఒక రాత్రివేళ చెట్టు కొమ్మలు గలగల మనే సరికి వాళ్ళు తల లెత్తి చూశారు. చెట్టు మీద వాళ్ళకొక భయంకరాకారం కనబడింది. వాళ్ళు కేకలు పెట్టేసరికి భటులు కొందరు పరిగెత్తుకువచ్చి, చెట్టు మీద ఉన్న ఆకారాన్ని బాణాలతో కొట్టారు, దానిపైకి ఈటెలు విసిరారు. కాని ఆ ఆయుధాలు ఆ ఆకారాన్ని ఏమీ చెయ్యలేకపోయాయి. అది చెట్టు మీది పిందెను కోసి, బలంగా నేలకేసి కొట్టింది. ఆ దెబ్బకు పిందె చితికి పోయింది.

ఈ సంఘటన గురించి రాజుగారికి తెలిసింది. రాజపురోహితుడు మొదలైనవారు సంగతంతా విని, "ఆ చెట్టు మీద ఉండేది ఏదో బ్రహ్మరాక్షసి అయి ఉంటుంది," అన్నారు. బ్రహ్మరాక్షసి అయితేమటుకు ఆ చెట్టున కాసే పిందెల పైన ఎందుకు

పగ పట్టాలో ఎవరికీ తెలియలేదు. అంతే గాక ఆ బ్రహ్మరాక్షసి మిగతా చెట్ల జోలికి పోలేదు, మిగతా సమయాలలో ఎవరికీ కన బడలేదు, చెట్టుకు పిందె పడినప్పుడే కని పించింది.

ఆ బ్రహ్మరాక్షసి చెట్టు వదిలి వెళ్ళి పోయేటట్టు చెయ్యమని రాజు కొందరు మంత్రవేత్తలను నియోగించాడు. వాళ్ళు చెట్టుకు కొన్ని రక్షలు కడతామనీ, కొన్ని యంత్రాలు చెట్టు కింద పాతి పెడతామనీ, వాటి ఫలితంగా, ఈసారి చెట్టున పిందె పడి నప్పుడు బ్రహ్మరాక్షసి చెట్టు మీదికి రాలేక పోతుందనీ రాజుకు మాట ఇచ్చారు.

అయితే వాళ్ళు చెట్టును సమీపించేసరికి ఎవరో అదృశ్యంగా ఉండి, వాళ్ళను చావ బాదారు. అదృశ్యంగా ఉన్నప్పటికీ బ్రహ్మ రాక్షసి చెట్టును వదిలిపోలేదని స్పష్ట మయింది. మంత్రవేత్తలు పిశాచమంత్రాలు ఉచ్చాటన చేశారు గాని, ఫలితం లేక పోయింది. ఆటుతరవాత తోటవాళ్ళు కూడా ఆ చెట్టు చాయలకు వెళ్ళటం మానేశారు. చేసేదిలేక రాజుగారు దాని చుట్టూ కంచె ఏర్పాటుచేసి, ఎవరూ చెట్టును సమీపించ కుండా చేశాడు.

ఇది జరిగాక కూడా చెట్టున మూడు మాసాల కొక పిందె పడటమూ, బ్రహ్మ





రాక్షసి దాన్ని ధ్వంసం చెయ్యటమూ జరుగుతూ వచ్చింది. కొంతకాలానికి మరొక విచిత్రం జరిగింది.

ఈ చెట్టుకు కొద్ది ఎడంలో బాటసార్లు నడిచే దారి ఉన్నది. ఒకనాడా బాట వెంబడి ఆశ్రమవాసి అయిన ఒక బ్రహ్మచారి నడుస్తూండగా అతని ఎదట బ్రహ్మరాక్షసి కనిపించి, "నువ్వు క్రుద్ధముని శిష్యుడివా?" అని అడిగింది.

బ్రహ్మరాక్షసిని చూసి, భయంతో వణికిపోతూ ఆ బ్రహ్మచారి, "కాను," అన్నాడు.

"అయితే వెళ్ళు," అని బ్రహ్మరాక్షసి మాయమయింది.

ఇలా మునిశిష్యులలాగా కనిపించే వాళ్ళెవరైనా అటుగావస్తే బ్రహ్మరాక్షసి వారి ఎదట ప్రత్యక్షమై, "నువ్వు క్రుద్ధముని శిష్యుడివా?" అని అడగటమూ, వాళ్ళు కాదనటమూ, బ్రహ్మరాక్షసి ఒక్క అరుపు అరిచి మాయం కావటమూ అనేక పర్యాయాలు జరిగింది.

బ్రహ్మరాక్షసికి భయపడి అటుగా జనం నడవటమే మానేశారు.

బ్రహ్మరాక్షసి కారణంగా రాజుకు పెద్ద విచారం పట్టుకున్నది. ఆ దిక్కుమాలిన చెట్టును కొట్టేయిస్తే బ్రహ్మరాక్షసి పీడ విరగడ అవునేమో కాని, ఆ బ్రహ్మరాక్షసికి వెరిచి ఎవరూ చెట్టును కొట్టటానికి సాహసించరు. అందుచేత రాజు ఒక ఉపాయం ఆలోచించాడు.

రాజుగారి కొక చక్కని చుక్క అయిన కూతురున్నది. ఆ పిల్లకు పెళ్ళి యీడు వచ్చింది. ఎంతలేసి రాజకుమారులూ ఆమెను పెళ్ళాడతామని కబుర్లు చేస్తున్నారు. ఈ బ్రహ్మరాక్షసిని వదలగొట్టిన వాడికే తన కుమార్తె నిస్తానన్న పక్షంలో, బ్రహ్మరాక్షసి పీడ విరగడకావటమే గాక, మంచి ప్రతిభావంతుణ్ణి అల్లుడుగా పొందినట్టవుతుంది. పిల్లను ఎవరికిస్తే ఎవరికి ఆగ్రహం వస్తుందో

నన్ను సమస్య కూడా తొలగిపోతుంది. ఇన్నీ ఆలోచించి రాజు, తన తోటలోని దేవతా వృక్షాన్ని పట్టిన బ్రహ్మరాక్షసిని ఎవరు వదల గొట్టితే వారికి తన కుమార్తెను కనక మంజరిని ఇచ్చి పెళ్ళి చేస్తానని దేశదేశాలా చాటింపు వేయించాడు.

ఆ చాటింపు వినగానే, కనకమంజరిని చేసుకుంటా మని అప్పటిదాకా ఉబలాట పడుతున్న రాజకుమారు లందరూ ఒక్క సారిగా వెనక్కు తగ్గారు.

ఒక్క వజ్రభుజు డనే వాడు మాత్రం ఈ బ్రహ్మరాక్షసి గురించి ప్రజలకు తెలిసిన సమాచారమంతా శ్రద్ధగా సేకరించి, దీర్ఘంగా ఆలోచించిన మీదట, తాను బ్రహ్మరాక్షసిని వదిలించటానికి ప్రయత్నం చేయవచ్చునని నిశ్చయించుకున్నాడు.

వజ్రభుజుడు కైవర్తదేశపు యువరాజు. అతను చాలా తెలివిగల వాడూ, అనేక విద్యలలో ఆరితేరినవాడూనూ. అతను ఆశ్రమవాసి అయిన బ్రహ్మచారి వేషం ధరించి, నిర్జనంగా ఉన్న బాట వెంబడి శిలావర్త రాజధానిని సమీపించాడు.

అతను ఊహించినట్టే, రాజోద్యానం సమీపంలోకి వచ్చేసరికి బ్రహ్మరాక్షసి అతని ముందు ప్రత్యక్షమై, "నువు క్రుద్ధముని శిష్యుడివా?" అని అడిగింది.





"అవును, నేను క్రుద్ధమునీశ్వరులవారి శిష్యుణ్ణి. నాతో నీకేం పని?" అని వజ్రభుజుడు బ్రహ్మరాక్షసి నడిగాడు.

బ్రహ్మరాక్షసి అతని కాళ్ళమీద పడి, "అయితే, నా శాపవిముక్తికి ఉపాయం చెప్పు," అన్నది.

"లే! లే! విచారించకు! నేను నీకు తప్పక శాపవిమోచనం కలిగిస్తాను. కాని, ముందు నీ సంగతి నాకు సవిస్తరంగా చెప్పు. తరవాత గురువు గారి అనుగ్రహం చేత నీకు శాపవిమోచన మార్గం చెపుతాను," అన్నాడు రాజకుమారుడు. అతనితో బ్రహ్మరాక్షసి తన కథ ఇలా చెప్పింది:

"హిమాలయాల మధ్య ఉండే ఒక దేశపు రాజకుమారుణ్ణి నేను. నా పేరు చైత్రుడు. మా దేశానికి సమీపంగానే క్రుద్ధ మహాముని ఆశ్రమం ఉండేది. ఆ ఆశ్రమంలో అపూర్వమైన చెట్టుండేది. దానికి మూడు నెలలకు ఒకే పండు కాసేది. ఆ పండును ఎలాగైనా సంపాదించి తినాలని నాకు బలమైన కోరిక పుట్టింది. ఒకసారి దొంగతనంగా ఆశ్రమం ప్రవేశించి, చెట్టున ఉన్న పండును కోసి తినేశాను. సరిగా ఆ క్షణంలోనే క్రుద్ధమహాముని అక్కడికి వచ్చి, నన్ను బ్రహ్మరాక్షసి కమ్మని శపించాడు. నాకు అందమైన రూపం కాస్తా పోయి బ్రహ్మరాక్షసి ఘోరాకారం వచ్చేసింది. నాకు దుఃఖం ఆగలేదు. నేనా ముని కాళ్లపైన పడి శాపవిమోచనం కలిగించమని వేడుకున్నాను. ఆయన నాకు శాపవిమోచన మార్గం చెప్పక పోగా, నేను తిన్న పండులో ఉండే విత్తు నుంచి మరొక చెట్టు పుట్టి దానికి కాయలు కాసి, వాటి నెవరన్నా తింటే నేను చచ్చి భస్మమై పోతానని చెప్పాడు. నేనాయన కాళ్లు గట్టిగా పుచ్చుకుని, నాకిలా శాపం మీద శాపం ఇవ్వటం తగదనీ, శాపవిమోచన మార్గం చెప్పి పుణ్యం కట్టుకోమనీ ప్రాధేయ పడ్డాను.

అప్పుడాయన నాతో, ' నేనే క్రుద్ధమహాముని శిష్యుణ్ణి అని ఎవడైతే నీతో చెబుతాడో వాడే నీకు శాపవిమోచనం కూడా కలిగిస్తాడు. వెళ్లు,' అన్నాడు. ఎంత మందినో అడిగాను, నే నే క్రుద్ధమహాముని శిష్యుణ్ణి అన్నవాడు లేడు. ఇంత కాలానికి నువ్వామాట అన్నావు. నాకు శాపవిముక్తి కలిగించు!"

అంతా విని రాజకుమారుడు, "అయితే, నువ్వీ ప్రాంతాల ఏం చేస్తున్నావు? క్రుద్ధ మహాముని శిష్యుల కోసం చూసేవాడివి హిమాలయ ప్రాంతాలలోనే ఉండక ఇంత దూరం దేనికి రావలిసి వచ్చిందీ?" అని బ్రహ్మరాక్షసిని అడిగాడు.

"నేను తిన్న పండులోని విత్తు నుంచి చెట్టు మొలిచి, కాయలు కాసి, వాటి నెవ రన్నా తింటే నేను భస్మమై పోతానని ముని అనగానే నాకు భయంవేసి, నా చేతిలో ఉన్న విత్తును దూరంగా సముద్రం మీద గిరవాటు వేశాను. కాని నా దురదృష్టం కొద్దీ ఆ విత్తు ఎలాగో ఈ రాజ్యం చేరి ఇక్కడ చెట్టు మొలిచి, కాయలు కాస్తున్నది. ఈ సంగతి నాకు తెలియగానే నే నిక్కడికి వచ్చి, చెట్టుమీద చేరి, పడిన పిందెను పడి నట్టే గిల్లి పారేస్తున్నాను. నీ దయవల్ల నాకు శాపవిముక్తి కలిగిందంటే నే నీ ప్రాంతాలు విడిచి, నా దేశానికి తిరిగి పోతాన్ను. కనక





శాపవిముక్తి మార్గం చెప్పు," అన్నది బ్రహ్మరాక్షసి.

రాజకుమారుడు నవ్వి, "వెర్రివాడా, నీకు గురువుగారు చెప్పినది అర్థం కాలేదు. అప్పటికే నీకు బ్రహ్మరాక్షసత్వం వచ్చి ఉండటంచేత ఆయన చెప్పిన విమోచన మార్గాన్ని రెండో శాపంగా అర్థంచేసుకున్నావు. అది నీకు అర్థమయే లాగా చెప్పే పనిని గురువుగారు నా పైన పెట్టారు. నువు కొంత కాలంపాటు బ్రహ్మరాక్షసి జీవితం గడిపి, శిక్ష అనుభవించాలని కూడా ఆయన ఉద్దేశం అయి ఉంటుంది. నువు తిన్న పండులోని విత్తు నుంచి చెట్టు మొలిచి, దాని పళ్ళను ఎవరైనా తిన్నట్టయితే వారు భస్మమైపోతారనీ, నీకు శాపవిముక్తి కలుగుతుందనీ గురువుగారి అభిప్రాయం. అందుచేత ఈ చెట్టుకు కాసే పిందెలను నీవు గిల్లటం చేత నీకే నష్టం కలుగుతున్నది. చెట్టున పండు పండనీ. ఎవరో ఒకరు దాన్ని తిని భస్మమైపోతారు. నీకు శాపవిముక్తి కలుగుతుంది," అన్నాడు.

ఈ మాట విని బ్రహ్మరాక్షసి పరమానందం చెందింది. అది రాజకుమారుడికి కృతజ్ఞత చెప్పుకుని మాయమయింది. ప్రభుజుడు తన సహజవేషం ధరించి శృంగభుజ మహారాజు వద్దకు వెళ్ళి, "నేను మీ తోటలోని బ్రహ్మరాక్షసిని సాగనంపి వస్తున్నాను. ఈసారి మీ చెట్టుకు కాయ కాసి, పండి, దాన్ని మీరు తిన్నాక మీ అమ్మాయిని నాకిచ్చి పెళ్ళిచెయ్యండి," అంటూ జరిగినదంతా చెప్పాడు.

చెట్టు చుట్టూ ఉండే కంచె తీసేసి, దాని కిందికి మనుషులు వెళ్ళారు. బ్రహ్మరాక్షసి వారిని బాధించలేదు. త్వరలోనే దానికి పింద పడి, కొద్ది రోజులలోనే కాయ అయి, పండింది. రాజుగారు ఆ పండును కోయించి, ఒక ముక్క తాను తిన్నాడు. ఆ క్షణంలోనే చెట్టు మీద భగ్గున మంట పుట్టి అరి

పోయింది. తట్టెడు బూడిద నేల రాలింది. శాపవిమోచన కోసరం ఎదురు చూస్తూ ఆ చెట్టు మీదనే అదృశ్యంగా ఉండిన బ్రహ్మరాక్షసి క్రుద్ధమహాముని చెప్పినట్టు గానే, మండి బూడిద అయిపోయింది.

తరవాత శృంగభుజ మహారాజు తన కుమార్తెను వజ్రభుజుడి కిచ్చి వైభవంగా పెళ్ళిచేశాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, క్రుద్ధ మహాముని బ్రహ్మరాక్షసికి శాపవిమోచన మార్గం ఎందుకు చెప్పాడు కాడు? అకారణంగా శాపం మీద శాపం ఎందు కిచ్చాడు? వజ్రభుజుడు తాను క్రుద్ధమహాముని శిష్యుణ్ణని అబద్ధ మాడటమే కాక, బ్రహ్మరాక్షసితో క్రుద్ధమహాముని మాటలకు లేని అర్థాలు చెప్పి, అతన్ని నాశనం చేయుటం అక్రమం కదా? ఈ ప్రశ్నలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "క్రుద్ధమహాముని శాపం మీద శాపం పెట్టలేదు. బ్రహ్మరాక్షసికి శాపవిమోచనం కలిగేమార్గం బూడిద అయి పోవటమే. ఆ సంగతి వజ్రభుజుడు సరిగానే గ్రహించాడు. బ్రహ్మరాక్షసికి శాపవిమోచనం కలిగే ఉపాయాన్నే అతను చెప్పాడు. అయితే, అతను అబద్ధం ఆడకపోతే బ్రహ్మరాక్షసి శాపవిమోచనానికి ఒప్పుకోడు. తాను క్రుద్ధమహాముని శిష్యుణ్ణే ననటంలో కూడా అతను క్రుద్ధమహాముని మాటలను అబద్ధం చెయ్యలేదు. తన శిష్యుడైనవాడే శాపవిమోచన మార్గం చెబుతాడని ఆ ముని అనలేదు; 'నే నే క్రుద్ధమహాముని శిష్యుణ్ణి,' అన్నవాడు ఆ పని చేస్తాడన్నాడు. వజ్రభుజుడే ఆ మాట అన్నాడు, ఆ పని చేశాడు కూడా," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# నాట్యప్రదర్శన

ఒక దంభయ్యు పాపన్న దగ్గిర గిల్టునగలు కుదవపెట్టి మూడువేల రూపాయలు అప్పు తీసుకున్నాడన్న వార్త కార్చిచ్చు లాగా చుట్టుపక్కల గ్రామాలకు కూడా పాకి, దంభయ్యు పరువంతా ఒక్కసారిగా తుడిచి పెట్టుకుపోయింది.

ఇది జరిగిన కొద్దిరోజులకే ఆ దేశపు రాజుగారు జైత్రయాత్ర నుంచి తిరిగి వస్తూ, ఆ ప్రాంతాలలోనే మజిలీ చేస్తారని తెలియవచ్చింది. ఆ చుట్టుపక్కల ఉండే పది, పన్నెండు గ్రామాల ప్రముఖు లందరూ చేరి, రాజుగారికి మర్యాదలన్నీ జరిపి, ఆయన గౌరవార్థం విందులూ, వినోదాలూ ఏర్పాటు చెయ్యాలని తీర్మానించారు. ఇలా కార్యభారం మీద వేసుకున్న వారిలో పాపన్న కూడా ఉన్నాడు.

ఆ పది, పన్నెండు గ్రామాలలో ఉండే నటులూ, గాయకులూ, నర్తకులూ, వాద్యగాళ్ళూ ఏకమై, రాజుగారి ముందు వేరు వేరు కళాప్రదర్శన లిచ్చి, తగిన సన్మానం పొంది, ఆ డబ్బుతో కళాభివృద్ధికి సాధనాలూ, స్థలసౌకర్యాలూ ఏర్పాటు చేసుకుందా మనుకున్నారు. ఇప్పు డున్న స్థితిలో వారికి తగిన దుస్తులూ, ఆభరణాలూ, వాద్యాలూ తగినట్టుగా లేవు. అందుచేత రాజుగారి ముందు ప్రదర్శన లివ్వటానికి ప్రతిదీ ఎక్కడో ఒకచోట అరువు తేవలిసి వచ్చింది. అన్నీ దొరికాయి గాని నాట్యగత్తెకు కావలిసిన ఆభరణాలు మాత్రం అరువుకు కూడా దొరకలేదు.

ఈ సంగతి వినగానే పాపన్న ఉండే గ్రామాధికారికి పాపన్న వద్ద తాకట్టున్న గిల్టునగలు జ్ఞాపకం వచ్చాయి. ఆయన కళాకారులతో, "మా వూరి పాపన్న వద్ద గిల్టునగ లున్నాయి. అవి మీ నర్తకి చేసే భరతనాట్యానికి పనికొస్తాయి. అవి మీరు

వాడుకుని, రాజుగారు నర్తకికి చేసే సన్మానంలో మూడోవంతు అతనికి ముట్టజెప్పండి. ప్రతిఫలం మాట ముందుగా పాపన్నతో మాత్రం అనకండి. అతనికి అలాటివి పనికిరావు," అన్నాడు.

కళాకారులు గ్రామాధికారిని వెంటబెట్టుకుని పాపన్న ఇంటికి వెళ్ళి, భరతనాట్య ప్రదర్శనానికి గిల్టునగలు అరువియ్యమని కోరారు. "నా దగ్గిర గిల్టునగ లేవీ లేవే?" అన్నాడు పాపన్న.

"అలా అంటావేం, పాపన్నా? మన గ్రామం దంభయ్య నీ దగ్గిర కుదవబెట్టినవి గిల్టు నగలేగా?" అన్నాడు గ్రామాధికారి.

"అవి దంభయ్యవి గద. అదీగాక ఆ పెట్టె తాళంచెవి నా దగ్గిర లేదు. మీకు నగలే కావాలంటే మంచి నగలే ఇస్తాను, తీసుకోండి," అన్నాడు పాపన్న.

"మంచి నగలు కావాలంటే నీదాకా వస్తామా? వీళ్ళు మంచినగలు తీసుకోరు. నాట్యానికి నకిలీ నగలే కావాలి. అవి దొరక్కనే నీ దాకా రావలిసివచ్చింది," అన్నాడు గ్రామాధికారి.

ఆయన దంభయ్య ఇంటికి మనిషిని పంపి, దంభయ్యను తాళంచెవితో సహా రప్పించాడు. దంభయ్య వచ్చి, ఏ ఆక్షేపణా చెప్పక, తాళంచెవి ఇచ్చి నకిలీ నగలను నాట్యగత్తెకు ఇప్పించాడు.



అందరూ అనుకున్నట్టుగానే రాజుగారు ఆ ప్రాంతాల శిబిరం వేశారు. చుట్టుపట్ల గ్రామాల వాళ్ళు ఆయనకు సకల మర్యాదలూ చేసి, విందులూ, వినోద కార్యక్రమాలూ జరిపించారు. రాజుగారు కళా ప్రదర్శనాలన్నిటినీ మెచ్చుకున్నారు. భరతనాట్య ప్రదర్శనం ఆయనకు ప్రత్యేకంగా నచ్చింది. నాట్యగత్తెకు పదివేల రూపాయలు బహుమానం ఇచ్చాడు రాజుగారు.

నాట్యగత్తె గ్రామాధికారిని వెంటబెట్టుకుని పాపన్న ఇంటికి వచ్చి, "ఇవిగో,

మీ నగలు. ఇదుగో బహుమానంలో మీ వంతు," అంటూ పాపన్న ముందు గిల్టు నగలూ, మూడువేల మూడువందల చిల్లర రొక్కమూ పెట్టింది.

పాపన్న ఆ డబ్బు చూసి విస్తుపోయి, "ఈ డబ్బేమిటి?" అన్నాడు.

"గిల్టునగలు అరువిచ్చిన వారికి బహుమానంలో మూడోవంతు ఇవ్వవలిసి ఉంటుందని ముందే నిర్ణయించుకున్నాం. రాజుగారు అనుగ్రహించి పెద్దమొత్తం ఇచ్చారు. అందులో మూడోవంతు నీదే!" అన్నాడు గ్రామాధికారి.

"గిల్టునగలు దంభయ్యవి. ఈ డబ్బు అతనికే చెందాలి," అన్నాడు పాపన్న గిల్టు నగలను మాత్రం ఎత్తి పెట్టెలో పెడుతూ.

గ్రామాధికారి ఆ డబ్బును తీసుకుపోయి దంభయ్య ముందు పెట్టి, జరిగిన సంగతి చెప్పి, "గిల్టునగలు నీవే గనక ఈ డబ్బు నీకే చెందాలంటున్నాడు పాపన్న," అన్నాడు.

దంభయ్య గ్రామాధికారితో, "అలాగా? అయితే మీరు కాస్త నా వెంట పాపన్న ఇంటికి రావాలి," అని ఆ డబ్బును తీసుకుని, పాపన్న ఇంటికి వచ్చి, పాపన్నతో, "పాపన్నా, ఇదుగో నీ బాకీ. ఇది తీసుకుని నా నకిలీనగలు నా కిచ్చెయ్యి. నీ చేతి మహత్యం వల్ల ఈ నకిలీనగలకు బంగారం విలువ వచ్చింది. నాకు మంచి పాఠం కూడా వచ్చింది. ఈ విధంగానైనా నన్ను ఋణవిముక్తుణ్ణి చెయ్యి, పాపన్నా," అన్నాడు దీనంగా.

"అలాగే, నీ నగలు నువు తీసుకో," అన్నాడు పాపన్న.

దంభయ్య మూలాన పాపన్న నష్టపోయినప్పుడు గ్రామంలో వాళ్ళు విచారించారు గాని పాపన్న ఏమీ విచారించలేదు. అలాగే అతని డబ్బు తిరిగి వచ్చినందుకు పాపన్న సంతోషించకపోయినా, అతని గ్రామంలో వాళ్ళు ఎంతో సంతోషించారు.





# మానవుల అభ్యుదయం

ఆదికాలంలో దేవదానవులకు ఘోర యుద్ధాలు జరిగేవి. ఒకప్పుడు దేవతలు గెలిచేవారు, మరొకప్పుడు దానవులు గెలిచేవారు. ఆ యుద్ధాలలో దానవులు గెలిచినా, ఓడినా వాళ్ళ భయం మనుష్యులకు ఎప్పుడూ ఉండేది. ఆ దానవుల దుర్మార్గం వల్ల భూమిపైన మనుష్యజాతి మిగలకుండాపోయే పరిస్థితి ఏర్పడింది.

దానవుల చేత చావగా మిగిలిన మనుష్యులు మనుమహాముని ఆశ్రమానికి వచ్చి, "మహర్షీ, మనుష్యజాతిని కాపాడే భారం నీవే వహించాలి," అని ప్రాథేయపడ్డారు.

మనువు దేవాంశసంభూతుడు. చాలా గొప్పవాడు. మనుష్యుల దీనస్థితి చూసి చాలా జాలిపడి, తన ఆశ్రమంలో తల దాచుకున్న వారిని యజ్ఞకర్మలద్వారా పోషిస్తూ, మనుష్యులకు దానవ బాధ లేకుండా ఉండగలందులకు ప్రత్యేకంగా ఒక క్రతువు చేశాడు. ఆ క్రతువు ముగిసే సరికి హోమగుండంలో నుంచి రెండు పళ్ళాలు బయటికి వచ్చాయి. వాటిని దేవతల ప్రసాదంగా స్వీకరించి మనువు తన ఆశ్రమంలో ఉంచి పూజిస్తూ వచ్చాడు.

ఒకనాడు దానవులు మనుష్యులను పీడించి, పీక్కుతినే ఉద్దేశంతో మన్వాశ్రమానికి వచ్చారు. వెంటనే ఆ రెండు పళ్ళాలూ ఒకదాన్నొకటి తాకి పెద్దగా ధ్వని చేశాయి. ఆ ధ్వని చెవులపడుతూనే దానవులు ప్రాణాలు వదిలారు.

ఇలా ఒకటి రెండు సార్లు జరిగిన అనంతరం దానవులకు ఆ పళ్ళాల మహిమ పూర్తిగా అర్థమయింది. అవి ఉన్నంత కాలమూ దానవులు మనుష్యుల జోలికి పోలేరు. అందుచేత ఆ పళ్ళాలను మనువు వద్ద నుంచి ఎలాగైనా సంగ్రహించాలి



"మనువు మహా దాత. నిత్యమూ యజ్ఞాలు చేస్తూ బ్రాహ్మణులకు దానాలు చేస్తాడు. దానం చేసేటప్పుడు ఎవరేది అడిగినా కాదనడు. ఆ విధంగా ఆ పళ్ళాలను ఎవరైనా దానం పుచ్చుకుంటే మనకు వాటి భయం తీరిపోతుంది," అని అపుష్పకుడనే దానవుడు సలహా ఇచ్చాడు.

దానవులు, శుక్రాచార్యుడి శిష్యులైన త్రిపురుడూ, శంఖదూతా అనే ఇద్దరు బ్రాహ్మణులను మాంసంతో సంతర్పణ చేస్తామని లోభపెట్టి, పళ్ళాలను మనువు నుంచి దానంగా పుచ్చుకు రావటానికి పంపారు. శుక్రుడి శిష్యులు అలాగే మన్వాశ్రమానికి వెళ్ళి, యజ్ఞంలో పాల్గొని, దానాలు తీసుకునే సమయంలో పళ్ళాలు కోరారు. మహాదాత అయిన మనువు లేదనకుండా వాళ్ళకా పళ్ళాలను దానం చేశాడు. శుక్రుడి శిష్యులు వాటిని తీసుకుపోయి దానవులకిచ్చారు. దానవులు వాటిని ముక్కలుగా కత్తిరించి, నిప్పులో వేసి చూర్ణం చేసి, ఆ చూర్ణాన్ని భూమిలో పాతేశారు.

మర్నాడే అక్కడ పచ్చిక మొలిచింది. మన్వాశ్రమానికి చెందిన పశు వొకటి అటుగా వచ్చి, ఆ పచ్చిక మేసి ఆశ్రమానికి తిరిగి వెళ్ళింది.

పళ్ళాలు పోయాయి గనక మనుష్యులను అవలీలగా పీక్కుతినవచ్చునని, దానవులు మన్వాశ్రమం మీద పడ్డారు. వారిని చూసి పచ్చిక మేసిన పశువు గట్టిగా రంకె పెట్టింది. ఆ రంకె చెవుల పడుతూనే దానవులు గుండెలవిసి చచ్చారు. దాన్ని సమీపించిన వాళ్ళు దాని ఊపిరికి నిలువునా మాడి, మసి అయిపోయారు.

ఒక ప్రతిబంధకం పోయిందనుకుంటే రాక్షసులకు మరొకటి దాపరించింది. వాళ్ళు మళ్ళీ శుక్రాచార్య శిష్యుల వద్దకు వెళ్ళి, తమకు కలిగిన కొత్తకష్టాన్ని చెప్పుకుని, "మీరు మళ్ళీ మన్వాశ్రమానికి వెళ్ళి,

మనువు వద్ద పశువును దానంగా పుచ్చుకు రండి," అని పంపారు. త్రిపుర, శంఖ దూతలు మనువు వద్దకు వెళ్ళి, అడగటమే తడవుగా పశువును దానంగా పొంది, దాన్ని తెచ్చి, దానవుల కిచ్చారు.

దానవు లా పశువును చంపి, కాల్చి, దాని బూడిదను తెచ్చి ఒక కొలనులో కలిపేసి, తమదారిన తాము వెళ్ళిపోయారు. తరవాత కొద్దిసేపటికి మనువు భార్య ఆ కొలనులోనే స్నానంచేసి, నీళ్ళు తీసుకుని ఆశ్రమానికి తిరిగి వెళ్ళింది.

పశువు పోయింది గనక తమ కిక భయం లేదనుకుని దానవులు మరొకసారి మన్వాశ్రమం మీదికి వచ్చారు. కాని ఈ సారి మనువు భార్య వారి కేసి చూసే సరికల్లా దానవులు ఎక్కడి వాళ్ళక్కడ మాడి, చచ్చి పడిపోయారు. మనువు భార్యను ఆశ్రమంలో లేకుండా చేయగలిగితే తప్ప దానవులు మనుషులను పీక్కుతినటం సాధ్యం కాదని తేలిపోయింది.

దానవులు తిరిగి శుక్రశిష్యులతో, "ఈ సారి మీరు మనువు భార్యను దానంగా అడిగి పుచ్చుకుని, ఆమెను చంపి, వండి మాకు భోజనం పెట్టండి. అలా అయితేనే గాని మాకు పట్టిన ఈ పీడ విరగడ కాదు," అన్నారు.



ఈ మాటలు విని శుక్రశిష్యులు హడలి పోయారు. మనువు లాటి వాడి భార్యను దానం అడగట మెలా? నరమాంసం దాన వులకు వడ్డించట మెలా? కాని ఆ మాట పైకి అంటే దానవులు తమ ప్రాణాలు నిలువునా తీయవచ్చు. అందుచేత వాళ్ళు తమ గురువైన శుక్రాచార్లు వద్దకు వెళ్ళి, జరిగిన దంతా చెప్పి, దానవులు తమని ఇలాటి పనులు చెయ్యమంటున్నా రని ఘోష పెట్టారు.

శుక్రాచార్లు తన శిష్యులను పూర్వం చేసిన దానికి మందలించి, దానవులను పిలిచి, వాళ్ళను గట్టిగా చివాట్లు పెట్టి, "మోసంతోటే మీరు చివరకు సర్వనాశన మవుతారు," అని హెచ్చరించాడు.

అప్పటితో దానవులు తమ ఆట కట్టయిం దని గ్రహించవలసింది. కాని వారు మూర్ఖులు. అందుచేత ఇద్దరు దానవులు బ్రాహ్మణ వేషాలు ధరించి, మన్వాశ్రమా నికి వెళ్ళి, మనువు అందరికీ దానా లిచ్చే టప్పుడు, "అయ్యా, తమ భార్యను మాకు దానంగా ఇవ్వండి," అని అడిగారు.

"అలాగే తీసుకోండి," అంటూ మనువు తన భార్యను పిలిచి, "నిన్ను వీళ్ళకు దానంగా ఇచ్చాను," అన్నాడు.

"వీళ్ళకా? ఎవరు వీళ్ళు?" అంటూ మనువు భార్య దానవుల కేసి చురచురా చూసింది. తక్షణమే ఆ దానవు లిద్దరూ బూడిద కుప్పలైపోయారు.

అటు తరవాత దానవులు మనుషుల జోలికి రాలేదు. మనువు భార్య అనేకమంది బిడ్డలను కన్నది. దానవుల బాధ లేని కారణాన మనువువంశం విస్తరించింది. వాళ్ళు వేరువేరు ప్రాంతాలకు వెళ్ళి నివాసాలు కల్పించుకుని వృద్ధి చెందారు.

మనువు సంతతికి చెందినవాళ్ళు కావటం చేత మనుషులకు మానవు లనే పేరు స్థిరపడిపోయింది.





# దయ్యపుచాకిరి

శివాపురం జమీందారుగారికి శివాపురంలో పెద్ద లోగిలి ఉండేది. అయితే ఆయన అక్కడ ఎక్కువగా ఉండేవాడు కాడు, రాచ కార్యాలు జాస్తి కావటం చేత రాజధాని లోనే ఉండేవాడు. అయినా శివాపురం ఇంటి నౌకర్లూ, చాకర్లూ ఇంటిని కని పెట్టుకునే ఉండేవారు. తోటమాలి తోటపని చేసేవాడు, వంటవాళ్ళు వంటలు చేసే వాళ్ళు, ఇల్లుతుడిచేవాళ్ళు ఇల్లు తుడిచే వాళ్ళు, అంట్లుతోమేవాళ్ళు తోమేవాళ్ళు. అడిగే వాళ్ళెవరూ లేరు గనక వాళ్ళకు హాయిగా కాలక్షేపమవుతూండేది. అందరూ తమతమ పనులు ముగించుకుని, అవీ ఇవీ కబుర్లు చెప్పుకుంటూ, రాత్రిపూట కూడా తమ ఇళ్ళకుపోకుండా జమీందారు గారి లోగిట్లోనే పడుకునేవారు.

ఇలా సుఖంగా వెళ్ళిపోతున్న నౌకర్ల జీవితం మీద పెద్ద పిడుగు పడ్డట్టయింది. ఒక రోజు రాత్రి పొద్దుపోయి అందరూ కబుర్లు చెప్పుకుంటుండగా ఇంటి గదులలో ఎవరో నడిచిన చప్పుడూ, తలుపులు తెరిచిన చప్పుడూ, దభాల్న మూసిన చప్పుడూ అయింది. తరవాత వంట ఇంట్లో కూడా ఏవో చప్పుళ్ళు వినిపించాయి.

తలుపులన్నీ మూసి ఉన్న ఇంట్లో చప్పుళ్ళు వినిపిస్తే అవి దయ్యాల చప్పుళ్ళనే అనుకోవాలి. ఏ దొంగవాడో అయితే అందరూ మేలుకుని ఉండగా ఎలాటి చప్పుడూ చెయ్యడు. ఒకళ్ళిద్దరు ధైర్యం చేసి, "ఎవరది?" అని కేకలుపెట్టి చూశారు. కాని జవాబులేదు. చప్పుళ్ళు ఆగనూ లేదు.

ఆ రాత్రికి ఆ ఇంట్లో పడుకునేటందుకు ధైర్యంలేక నౌకర్లందరూ ఒకే మాట మీద, బయటికి వచ్చి, ఇంటికి తాళంపెట్టి, ఎవరి ఇంటికి వారు వెళ్ళిపోయారు. అయితే గంగు అనే కుర్రవాడొకడు ఇంట్లో దిగబడి

టి. బలరామయ్య



పోయాడు. వాడి విషయం ఎవరికీ గుర్తు రాలేదు. వాడు నౌకర్లకు నౌకరు కావటం చేత బాగా అలిసిపోయి, మిగిలినవాళ్ళంతా కబుర్లు చెప్పుకునే సమయంలో మంచం ఒకదాని కింద దూరి గాఢమైన నిద్రలో పడిపోయాడు.

మిగిలిన నౌకర్లంతా వెళ్ళిపోయిన కొద్ది సేపటికే వంట ఇంట్లో ఏదో పళ్ళెం దభాల్ని కిందపడి పెద్ద చప్పుడయేసరికి గంగులుకు నిద్రాభంగమయింది. వంట ఇంట్లో ఎవరో పని చేస్తున్నట్టు వాడు గ్రహించి ఆశ్చర్య పడ్డాడు. అర్ధరాత్రివేళ ఎందుకు పని చేస్తారు? ఒకవేళ తెల్లవారిందేమోనని వాడు మంచం కింది నుంచి పైకి వచ్చి చూస్తే మిగిలిన నౌకర్ల జాడ కనబడలేదు.

అందరూ వంట ఇంట్లో చేరారనుకుని గంగులు వంట ఇంటి కేసి వెళ్ళి, తెరిచి ఉన్న తలుపులో నుంచి తొంగిచూసి, మరు క్షణం కొయ్యబారిపోయాడు. వంట ఇంటో వాడి కొక పెద్ద కొండముచ్చులాటి ఆకారం పని చేస్తూ కనిపించింది. దాన్ని చూస్తూన్న కొద్దీ వాడి భయం ఆశ్చర్యంగా మారింది. ఏమంటే, ఆ కొండముచ్చు వంట ఇంట్లో అంట్లగిన్నెలు ఒక్కొక్కటే తోమి, తూము దగ్గిర కడిగి, తెచ్చి అలమారులలో చక్కగా బోర్లిస్తున్నది. . గంగులు అలాగే చూస్తూ ఉండిపోయాడు.

కొండముచ్చు అంట్లు తోమటం పూర్తి చేశాక, నీళ్ళుపోసి వంట ఇల్లంతా కడిగింది. ఎక్కడ పడితే అక్కడ నిర్లక్ష్యంగా పారేసి ఉన్న పాత్ర సామగ్రిని చక్కగా సర్దింది. చీపురుకట్టా, తుండుగుడ్డా తీసుకుని ఒక్కొక్క గదే ఊడుస్తూ; కుర్చీలూ, బల్లలూ తుడుస్తూ బయలుదేరింది. గంగులు దాని కంటపడకుండా ఒక మూల నక్కి, అది ఇంటి పని ఎంతో శ్రద్ధగా చేస్తూండటం చూసి ఆశ్చర్యపోయాడు. ఒక గంట లోపల ఆ కొండముచ్చు ఇంటి పనులన్నీ ముగించి,

మూసి ఉన్న ముఖద్వారం కుండా బయటికి వెళ్ళిపోయింది. ఆ తరవాత అంతా నిశ్శబ్దమైపోయింది.

ఆ కొండముచ్చు దయ్యమేనని గంగులు గ్రహించాడు. కాని వాడికి భయం కలగలేదు. పైపెచ్చు, అది ఇంటి పని అంతా అంత త్వరగానూ శుభ్రంగానూ చేసినందుకు ఎంతో ముచ్చట వేసింది. వాడు నిశ్చింతగా ఒక పరుపుమంచం మీద పడుకుని తెల్లవారే దాకా హాయిగా నిద్రపోయాడు.

తెల్లవారినాక నౌకర్లు వచ్చి గంగులును లేవగొట్టి, "ఓరీ, నువు తెల్లవార్లూ ఇక్కడే ఉన్నావా? నీకు దయ్యాల అల్లరి వినిపించలేదూ? ఇంకా నయం! అవి నిన్ను పీక్కుతిన్నాయి కావు!" అన్నారు.

"దయ్యాన్ని మీరు కూడా చూశారేమిటి?" అని గంగులు వాళ్ళను అడిగాడు.

"మేం చూడలేదు. నువు చూశావా?" అని వాళ్ళు గంగులును ఎదురడిగారు.

"చూడటమేమిటి? ఒక గంటసేపు అది చేసే చాకిరీ అంతా తనిఖీ చేశాను," అన్నాడు గంగులు గర్వంగా.

"దయ్యం చాకిరీ చేసిందా?" అని నౌకర్లు ఆశ్చర్యంగా అడిగారు.

"ఇంటి పని అంతా చేసింది. అంట్లు తోమింది. గిన్నెలు పేర్చింది. వంటిల్లంతా






శుభ్రంగా కడిగింది. ఇల్లంతా ఊడ్చింది. సామానులన్నీ శుభ్రంగా తుడిచింది. మీరు చెయ్యాలన్నా పనిలేదు,'' అని గంగులు వాళ్ళతో చెప్పాడు.

''అయితే, గంగులూ, ఆ దయ్యం చూడటానికెలా ఉందిరా?'' అని నౌకర్లు అడిగారు.

''ఇంత పెద్ద కొండముచ్చు!'' అన్నాడు గంగులు.

ఆ మాట వినగానే అందరూ భయపడ్డారు. వాళ్ళు ఇల్లంతా పరీక్షచేసి, దయ్యం చాకిరి చేసి వెళ్ళినమాట నిజమేనని తెలుసుకున్నారు. వాళ్ళకిక వంట చేసుకోవటమూ, తినటమూ తప్ప వేరే పనేలేదు. కాని రాత్రి పూట అక్కడ పడుకోవటానికి మటుకు వాళ్ళకు ధైర్యంలేదు. వాళ్ళు పొద్దుటి వంట పాత్రలను అలాగే ఉంచి, రాత్రి వంటకు వేరే పాత్రలను ఉపయోగించారు. ఎంగిలి పళ్ళాలు కూడా ఎత్తలేదు.

రాత్రి భోజనాలు కాగానే అందరూ వెళ్ళిపోతుంటే గంగులుకు ఒంటరిగా ఇంట్లో ఉండిపోవటానికి భయం వేసింది. దయ్యాలతో చెలగాటం మంచిది కాదు. ఆ మాట అనుకుని ఆ రాత్రి గంగులు కూడా వాళ్ళతో పాటు వెళ్ళిపోయాడు.

మర్నాడు పొద్దున నౌకర్లు తిరిగి వచ్చేసరికి ఎంగిళ్ళూ, వంట పాత్రలూ చక్కగా తోమి, అమర్చి ఉన్నాయి. ఇల్లంతా చక్కగా ఊడ్చి, సర్ది ఉన్నది. నౌకర్ల ఆనందానికి మితిలేదు. వాళ్ళు కొండముచ్చు దయ్యాన్ని మహా మెచ్చుకున్నారు. వాళ్ళు తమ మాసిన బట్టలను ఒక మూల పోగువేస్తే మర్నాటికి అవి ఉతికి, ఆరేసి ఉన్నాయి.

''ఎంత మంచి దయ్యం! ఎంత పనితనం గలది!'' అనుకున్నారు జమీందారు నౌకర్లందరూ.

ఈ విధంగా చాలా రోజులు గడిచినాక గంగులుకు ఆ దయ్యాన్ని మళ్ళీ చూడాలనిపించింది. వీలుంటే దాని ఎదటపడి పలక

రించటానికి కూడా వాడికి ధైర్యం వచ్చింది. అది నిజంగా ఎంతో మంచి దయ్యం అయి ఉండాలి. చెడ్డ దయ్యమైతే ఈపాటికి ఇంట్లో ఉండే సామానంతా ధ్వంసం చేసి, ఇల్లంతా ఒక కొలిక్కి తెచ్చి ఉండును.

ఇలా అనుకుని గంగులు ఒకనాటి రాత్రి, మిగిలిన నౌకర్లకు తెలియకుండా, అందరూ వెళ్ళిపోయే సమయానికి తాను ఏమూలో నక్కి, లోపలే ఉండిపోయాడు. ఒక రాత్రి వేళ కొండముచ్చు రానే వచ్చింది.

దడదడా గుండెలు కొట్టుకుంటూ, "నువ్వెవరు? ఎందుకు ప్రతి రాత్రీ వచ్చి ఇంటి చాకిరీ చేసిపోతున్నావు?" అని దయ్యాన్ని అడిగాడు గంగులు.

కొండముచ్చు నిట్టూర్చి, "ఏం చెప్పేది, నాయనా? నా కిది యమధర్మరాజు విధించిన శిక్ష. ఈ జమీందారుగారి బాబుగారి హయాంలో నేనీ యింటి నౌకరుగా ఉండే వాణ్ణి. మహా సోమరిపోతును. ఏనాడూ ఇటు పుల్ల తీసి అటుపెట్టి ఎరగను. పెదబాబు గారి సొమ్ము తిన్నందుకు నేను ప్రతి ఫలంగా చిన్నమెత్తు పని చెయ్యలేదు. నేను కాలంతీరి యమధర్మరాజు ఎదటికి పోయాక, ఆ దేవుడు నేను చేసిన తప్పు చెప్పి, నాకీ శిక్ష విధించాడు—ఈ కొండముచ్చు



రూపంలో వెళ్ళి ఇంటి చాకిరీ అంతా చేస్తూండమన్నాడు. చాకిరీకేం చేస్తానుగాని, ఈ చలికాలంలో ఆరుబయట నేనెంత బాధపడిపోతున్నానో ఆ భగవంతుడికే తెలియాలి. చలికి బిగుసుకుపోవటమే అసలు శిక్ష అనిపిస్తుంది," అన్నది.

గంగులుకు దయ్యాన్ని చూసి చాలా జాలివేసింది. "అయ్యో, పాపం! నేను మిగిలిన నౌకర్లతో మాట్లాడి నీకు మంచి చొక్కా, షరాయీ ఏర్పాటు చేయిస్తానుండు. అవి తొడుక్కుని గొంగళీ ఒకటి కప్పుకున్నావంటే నీకు చలే ఉండదు," అన్నాడు వాడు.

"ఆ పని చేస్తివా నా కష్టాలు తీరి పోతాయి," అన్నది దయ్యం.

మర్నాడు గంగులు మిగిలిన నౌకర్లతో, "నిన్న రాత్రి నేను దయ్యంతో మాట్లాడాను. పాపం, అది చలికి చాలా బాధపడుతున్న దిట. దానివల్ల మనం చాలా లాభం పొందు తున్నాం గనక దాని కొక ఉన్ని చొక్కా, ఒక ఉన్ని షరాయీ యిస్తే బాగుంటుంది. ఒక గొంగళి కూడా!" అంటూ దయ్యానికి యమధర్మరాజు విధించిన శిక్ష గురించి వివరంగా చెప్పాడు.

నౌకర్లందరూ కూడబలుక్కొని దయ్యం కోసం వెచ్చని దుస్తులూ, గొంగళీ ఏర్పాటు చేసి, వాటిని దయ్యానికి అందించే పని గంగులుకే అప్పగించారు.

ఆ రాత్రి కూడా గంగులు అక్కడే ఉండి పోయి, దయ్యం రాగానే దానికి ఉన్ని దుస్తులూ, గొంగళీ చూపాడు. దయ్యం వాటిని చూసి ఎంతో సంతోషించి, గంగులు సహాయంతో షరాయి తొడుక్కొని, చొక్కా వేసుకుని, గొంగళి కప్పుకుని, "వస్తాను," అని చెప్పి బయలుదేరింది.

"అదేమిటి, వెళ్ళిపోతున్నావు? అంట్లూ, ఎంగిళ్ళూ అలాగే పడి ఉన్నాయి!" అన్నాడు గంగులు.

"నా శిక్ష పూర్తి అయింది. నేను చేసిన పనికి ప్రతిఫలం ముట్టగానే నా పాపం తీరి పోతుందని యమధర్మరాజు చెప్పాడు. నేనిక ఈ ఇంట చాకిరీ చెయ్యక్కర్లేదు. అందుచేత నేను పోతున్నాను," అంటూ దయ్యం వెళ్ళిపోయింది.

మర్నాటి నుంచీ ఆ ఇంటి నౌకర్లు తమ పనులు తామే చేసుకోవలిసి వచ్చింది. అయినా వాళ్ళు విచారించలేదు. జమీం దారుగారి సొమ్ము తింటున్నందుకు పని చెయ్యకపోతే తమను కూడా యమధర్మ రాజు ఇలాగే శిక్షిస్తాడేమో నని వాళ్ళు భయపడ్డారు.






# ఐశ్వర్యంకంటె అదృష్టం మేలు

ఒక గ్రామంలో ఒక సామాన్య రైతు కొక కొడుకు కలిగాడు. ఆ రోజు అదృష్టదేవత రైతు ఇంటికొచ్చి, "నేను అదృష్టదేవతను. మీ బిడ్డను కనిపెట్టి ఉంటాను. ఐశ్వర్య దేవతను కాకపోవటం చేత మీవాడికి అంతు లేని సంపద ఇవ్వటం నాకు సాధ్యంకాదు, కాని అడుగడుగునా వాడికి కలిసివచ్చేటట్టు చూడగలను," అన్నది.

ఈ మాట విని రైతూ, అతని భార్యా పరమానందంచెంది, "అదే మాకు మహా భాగ్యం," అన్నారు.

అదృష్టదేవత అండతో రైతు కొడుకు రాహులుడు ఎలాటి ప్రమాదాలూ లేకుండా పెరిగి రాసాగాడు. ఎందుచేతనంటే, వాడు పొరపాటున కాలు జారిపడితే, అదృష్టదేవత పక్కనే ఉండి, వాడు పడేచోటు మెత్తగా ఉండేటట్టు చూసేది; వాడు ఎవరితోనైనా దెబ్బలాడితే అవతలివాడి దెబ్బలు గురి తప్పేటట్టూ, రాహులిడి దెబ్బలు గురిగా తగిలేటట్టూ చేసేది; రాహులుడు ఏ పని చేసినా కలిసివచ్చేటట్టూ, పూర్తి ఫలితం దక్కేటట్టూ చేసేది; దురదృష్టదేవత రాహులిడి కేసి రావటానికి ప్రయత్నించే పక్షంలో అదృష్టదేవత ఆమెను తరిమికొట్టేది.

ఈ విధంగా రాహులుడు అదృష్టదేవత రక్షణలో పెరిగి పెద్దవాడై తన తండ్రి పొలంలో పని చెయ్యసాగాడు. అక్కడ కూడా రాహులిడికి అదృష్టదేవత పూర్తిగా తోడ్పడింది. వాడు నాటినమొక్క ప్రతిదీ ఏపుగా పెరిగేది. వాడి పొలంలో కంకుల పైన పిట్ట వాలి ఎరగదు. వానలూ, వంగుళ్ళూ వచ్చి అందరి పొలాలూ నాశనమైనా వాడి పైరూ, వాడి పంటా సలక్షణంగా ఉండేది. నిజానికి పొలం పనులు చేసేవాళ్ళందరి కన్నా రాహులుడే తక్కువ చెమటోడ్చేవాడు. వాడికి పని చెయ్యట

ఆర్. తిరుమలరావు



మంటే కొంచెం కూడా ఒళ్ళు వంగేది కాదు. అయినా ఆ యేటికాయేడు వాడి వ్యవసాయం పెరుగుతూ, మరింత ఫల ప్రదమవుతూ వచ్చింది.

"ఇదంతా ఆ అదృష్టదేవత చలవ! నువు పట్టినది బంగారమవుతున్నదంటే ఆ చల్లని తల్లి దయే!" అన్నారు రాహులుడి తల్లిదండ్రులు.

"అదృష్టదేవత ఏనాడూ నా కొక ఎర్రని ఏగానీ బహూకరించిన పాపాన పోలేదు," అన్నాడు రాహులుడు.

"నాకు బహుమానా లిచ్చే శక్తిలేదు. నీ ప్రయత్నాలు కలిసివచ్చేటట్టు చెయ్య గలను. అదే నాకు చాతనయినది," అన్నది అదృష్టదేవత రాహులుడితో.

తండ్రి చనిపోయి రాహులుడు సొంత దారయేనాటికి ఆ గ్రామంలో వాడి పొలం లాటిది మరొకటి లేదు. వాడి యీడు వాళ్ళంతా వాడి పొలాన్నీ, వాణ్ణీ చూసి అసూయ పడేవాళ్ళు. "అదృష్టం కలిసి రావటంచేతనే నువు ఇంతవాడి వయావు," అని రాహులుణ్ణి అభినందించే వాళ్ళు.

"పొలం దున్ని విత్తులునాటితే మొక్కలు మొలవటం కూడా ఒక గొప్పేనా ఏమిటి?" అని రాహులుడు అసంతృప్తిగా అనేవాడు.

వాడి అసంతృప్తి చూసి ఒకసారి అదృష్ట దేవత, "నీకేం లోటయింది, బాబూ? ఎందుకు ఎప్పుడూ తృప్తిలేనివాడల్లే ఉంటావు?" అని అడిగింది.

"నాకు ఐశ్వర్యం కావాలి. ఏదీ?" అన్నాడు రాహులుడు.

"తొందరపడతా వెందుకూ? ఇప్పటికే నీ తండ్రి పొలం పదింతలయింది. నీ పశువుల మందలు పెరిగాయి. ఇదంతా సంపద కాదా?" అన్నది అదృష్టదేవత.

"అవునవును. నేను చేసే శ్రమకు కూలి డబ్బులు బాగానే గిట్టుబాటవుతున్నాయి. కాదన్నానా ఏం? కాని, నా యీడువాళ్ళు

చెయ్యీ, కాలూ కదల్చకుండా అంతు లేని ఐశ్వర్యంలో ఓలలాడుతున్నారు. ఈ పొలాలూ, పశువుల మందలూ ఎవడి క్కావాలి? ఏనాడైనా నాకు ఒక సంచీడు బంగారం ఇచ్చిన పాపాన పోయావా?" అన్నాడు రాహులుడు.

"అది నాకు సాధ్యమయే పని కాదని చెబితిని గద," అన్నది అదృష్టదేవత.

ఆ యేడు పంట అమ్మిన డబ్బు చేత పట్టుకుని రాహులుడు రాజుగారుండే పట్నా నికి వెళ్ళాడు. అక్కడివాళ్ళ వేషభాషలూ, వైభవాలూ, వినోదాలూ చూసి వాడికి కన్ను కుట్టింది. "జీవితమంటే, రాజుగారి కొలు వులో ఉండేవాళ్ళదే జీవితం! అనుభవిం చటం తప్ప మరోపనే లేదు!" అను కున్నాడు వాడు.

ఒక రోజు వాడు రాజకుమార్తె పల్లకీలో వీధివెంట పోతూండగా చూసి, "అహా, ఏం చక్కదనం! అటువంటిదాన్ని పెళ్ళాడ టానికి ఎంత త్యాగం చేస్తేనేం?" అనే శాడు పైకే.

ఆ సమయంలో పక్కనే ఉన్నవా డొకడు, "ఇలా అనుకునేవాళ్ళు నా తల వెంట్రుకలంత మంది ఉన్నారు. కాని ఏం లాభం? ఆ పిల్లేమో రజతరంజన రాజ



కుమారుణ్ణి ప్రేమించింది. ఆ అబ్బాయి దగ్గిర వెండి అయితే ఉందిగాని, బంగారం చిన్నమెత్తు కూడా లేదు. అంతకన్న ధనికు డైన అల్లుడు వస్తే అవునని రాజుగారి అభి ప్రాయం. చిట్టచివర కాయన ఆ పిల్లను అత్యధికమైన ఐశ్వర్యం గల వాడికే ఇచ్చి చేస్తాడు, చూస్తూ ఉండు," అని రాహులు డితో అన్నాడు.

రాహులుడికి తన జీవితం మీద అసహ్యం వేసింది. అదృష్టదేవత అండ తన కున్న దన్నమాటేగాని, రాజుగారి అస్థానంలో తనకు ఒక చిన్న ఆసనం కూడా లేదు. వాడు తన ఇంటికి తిరిగిపోయి, ఇల్లు కని



పెట్టుకుని ఉన్న అదృష్టదేవతతో, "నేను రాజకుమార్తెను ప్రేమించాను. ఆమెను పెళ్ళాడాలి," అన్నాడు.

"చాలా కష్టసాధ్యమే. నాకు చాతనైన సహాయం చేస్తాను. అదృష్టవశాన నువు రాజకుమార్తె ప్రాణాన్నిగాని, రాజు ప్రాణాన్నే గాని కాపాడటం జరిగేపక్షంలో—" అని అదృష్టదేవత ప్రారంభించింది.

"ఆ పప్పులేవీ ఉడకవు. రాజు తన కూతుర్ని హెచ్చు ఐశ్వర్యం గల వాడికే ఇస్తాడు," అన్నాడు రాహులుడు.

"దానికేం? నీ కన్న బీదవాడు కూడా అదృష్టం కలిసివచ్చి శ్రమిస్తే కుబేరుడు కావచ్చు. కావలిస్తే బంగారపుగను లుండే చోటు చూపిస్తాను. తవ్వించు. కృషి సాగించు," అన్నది అదృష్టదేవత.

"కృషి! శ్రమ! చాతనైతే నాకు మూడు పుట్ల బంగారం ఇయ్యి. మిగిలిన గని అంతా నువే ఉంచుకో!" అన్నాడు రాహులుడు.

"అలాటివి కోరవలిసింది నన్ను!" అంటూ ఐశ్వర్యదేవత వారి పక్కన ప్రత్యక్షమయింది. "నువ్వేమిస్తావు?" అన్నాడు రాహులుడు.

"నీ వెంట తిరుగుతూ కాపలాకాసే ఓపిక నాకు లేదు. ముచ్చటగా మూడు వరాలు కోరుకో. వాటిని నీ కిచ్చి, నా దారిన నేను చక్కాపోతాను," అన్నది ఐశ్వర్యదేవత.

"నేను వరాలు కోరటానికి సిద్ధంగానే ఉన్నాను," అన్నాడు రాహులుడు.

"ఆ వరాలిచ్చాక నీ పూచీ నాకేమీ ఉండదు. ఆ సంగతి ముందే తెలుసుకుంటే మంచిది," అన్నది ఐశ్వర్యదేవత.

"నాకూ ఉండదు. అది కూడా తెలుసుకో," అన్నది అదృష్టదేవత.

అదృష్టదేవతతో విసుగెత్తి ఉన్న రాహులుడు లక్ష్యంచెయ్యక ఐశ్వర్యదేవతను ఇలా వరాలు కోరాడు:

"ఒకటి, నాకు సాటిలేని అందం కావాలి; రెండు, రాజులకు అర్హమైన సంస్కారమూ, నాగరికతా అబ్బాలి; మూడు, నాకు తరగని బంగారం కావాలి."

"మూడూ ఇచ్చాను," అంటూ ఐశ్వర్య దేవత అదృశ్యమయింది. ఆ వెంటనే అదృష్టదేవత కూడా రాహులుణ్ణి విడిచి పెట్టి వెళ్ళి పోయింది.

రాహులుడు రాజాస్థానంలో ప్రవేశించ టానికీ, రాజుగారి దృష్టిలో సాటిలేని అల్లు డనిపించు కోవటానికీ ఎంతో కాలం పట్ట లేదు. రాజకుమార్తె ఇంకా రజతరంజన రాజకుమారుణ్ణే ప్రేమిస్తున్నది. కాని రాజు లక్ష్యపెట్టక, "నిన్ను సువర్ణరంజన రాజ కుమారుడికే ఇచ్చి చేస్తాను," అన్నాడు. రాహులు డిప్పుడు సువర్ణరంజన రాజ కుమారుడు.

పెళ్ళిరోజు వచ్చింది. పెళ్ళికొడుకూ, పెళ్ళికూతురూ రాజవీధిన ఊరేగింపు బయలుదేరారు. ఊరేగింపు ఒక నగర ద్వారాన్ని సమీపిస్తూండగా, ఆ ద్వారం మీద కూర్చుని ఉండిన రెండు కాకులు చివాలున లేచివెళ్ళి, దూరంగా ఉన్న చెట్టు పైన వాలాయి.

"ద్వారం మీద ఉండే రాయి మీద పడుతుందని ఆ పెళ్ళికొడుక్కు చెప్పే వాళ్ళెవరూ లేరా?" అన్నది ఒక కాకి రెండో దానితో.

ఆ కాకి అన్నంత పనీ జరిగింది.

పెళ్ళికొడుకు ఆకస్మిక మరణం వల్లా, చేసిన పెళ్ళి ఏర్పాట్లు వృథాపోవటం రాజు గారికి ఇష్టంలేకా, రాజకుమార్తెను రజత రంజన రాజకుమారుడికే ఇచ్చి పెళ్ళి పూర్తి చేయవలిసి వచ్చింది.

సువర్ణరంజన రాజకుమారుడి అంత్య క్రియలు మహావైభవంగా జరిగాయి. ముఖ్యంగా సువర్ణదానం చాలా చక్కగా జరిగింది. తరగని బంగారం ఉన్నది కద!






# మంత్రశక్తులు

ఒకప్పుడు నేపాళదేశం మాంత్రికులకు ప్రసిద్ధికెక్కినది. అక్కడ కొందరు సామాన్య ప్రజలకు కూడా కొన్నికొన్ని శక్తులుండేవి. ఒక గ్రామంలో పర్ధకు డనే ఒక వయసుమళ్ళిన పశువులకాపరి ఉండేవాడు. అత నొకనాడు పశువులను కాస్తూ, మిట్ట మధ్యాన్నం వేళ దాహంవేసి సత్రం బావి వద్దకు వచ్చి, సత్రం అరుగు మీద గ్రామ పెద్దలు చేరి కబుర్లాడుకుంటుంటే తాను కూడా చతికిలబడ్డాడు.

"ఏంరా, వర్ధకుడా? మందను ఎవరి కప్పగించి వచ్చావు? ఇక్కడే కూర్చుంటివే?" అన్నాడొక గ్రామపెద్ద.

"మంద కొచ్చిన భయ మేమీ లేదు," అన్నాడు పర్ధకుడు. వాడి మాటలకు అందరూ నవ్వి వెటకారం చేశారు.

"నవ్వకండి. నే నెక్కడ ఉన్నా పశువులు నా మాట వింటాయి. కావలిస్తే చూపిస్తాను. రెండు కోడెదూడలను ఇక్కడికి రప్పించనా?" అన్నాడు వర్ధకుడు.

"ఏదీ రప్పించు చూస్తాం!" అన్నారు ఊరివాళ్ళు.

వాళ్ళా మాట అన్న కాస్సేపటి కల్లా దూరాన మువ్వల చప్పుడు వినిపించింది. రెండు కోడెదూడలు శరవేగంతో పరిగెత్తుకుంటూ వచ్చి సత్రం దగ్గిర ఆగి, పర్ధకుడికేసి, మొరలెత్తి చూశాయి.

"ఇక పదండి. వెళ్ళి మీ మేత మీరు మెయ్యండి," అన్నాడు వర్ధకుడు. వెంటనే కోడెదూడలు వెనక్కు తిరిగి వెళ్ళిపోయాయి.

"చూశారు కదా! నే నున్నా లేకపోయినా అవి నా చెప్పుచేతలలో నే ఉంటాయి," అన్నాడు వర్ధకుడు.

"అవి తిన్నగా మంద ఉండే చోటికి చేరుతాయో, లేక ఎవరి పొలం మీదనన్నా పడి పాడుచేస్తాయో?" అన్నా డొకాయన.

పి. సుందరాచారి

"అటువంటిది ఒక్కనాటికీ జరగదు," అన్నాడు వర్ధకుడు.

అతని మాటలు నమ్మలేక కొందరు మనుషులు కోడెల వెనకగా బయలుదేరారు. వర్ధకు డన్నట్టు అవి తిన్నగా మంద ఉన్న చోటికే వెళ్ళి, తమ యుజమాని చెప్పినట్టు మేయ నారంభించాయి.

మరొకసారి ఇలాటి సంఘటనే జరిగింది. ఊళ్ళో ఉండే పెద్దషావుకారు గిత్తను కొన దలిచి, వర్ధకుణ్ణి వెంటబెట్టుకుని, తన వాళ్ళతో సహా సంతకు వెళ్ళాడు. చాలా గిత్తలను చూసినాక వాళ్ళకు నచ్చిన గిత్త దొరికింది. బేరం కుదిరింది. షావుకారు గిత్తను కొని వర్ధకుడి కిచ్చి, "దీన్ని ఇంటికి తీసుకుపోరా," అని చెప్పి, తాను తన వాళ్ళతో బండి మీద బస్తీకి పని ఉండి వెళ్ళిపోయాడు.

ఇంకా పొద్దు చాలా ఉన్నది. షావుకారు చీకటిపడి గానీ ఇల్లు చేరడు. అప్పుడే ఇంటికి వెళ్ళా లనిపించక వర్ధకుడు గిత్తతో, "నువు మనింటికి పోవే. నేను వెనకగా వస్తాను," అన్నాడు. గిత్త వెళ్ళిపోయింది.

వర్ధకుడు సాయంకాలం దాకా సంత లోనే గడిపి, తెలిసినవాళ్ళతో కబుర్లాడి, సూర్యాస్తమయం కాబోతుండగా ఇంటిదారి



పట్టాడు. వాడు షావుకారుగా రింటికి వెళ్ళే సరికి, సంతలో కొన్న గిత్త షావుకారుగారి పశువుల దొడ్డికి చేరి, కొట్టంలో ప్రవేశించక, బయటనే పడుకుని ఉన్నది. వర్ధకుడు దాన్ని లేవగొట్టి కొట్టంలోకి తీసుకుపోయి, ఒక గుంజకు కట్టి, ఇంత మేత వేశాడు.

ఆ గిత్త వర్ధకుడి చెప్పుచేతలలో ఉంటూండేది. అటువంటిది ఒకనాడు వర్ధకుణ్ణి కుమ్మబోయింది. వర్ధకుడు ఆశ్చర్యపడ్డాడు. అది మొదలు ఆ గిత్త వర్ధకుడు కనిపించినప్పుడల్లా, ముక్కులు పెద్దవి చేసి బుస కొట్టటమూ, తల విసర టమూ, కుమ్మబోపటమూ చేస్తూ వచ్చింది.



ఎవడో ప్రయోగం చేసి గిత్తను తన పైకి ఉసిగొల్పుతున్నాడని వర్ధకుడికి అర్ధమయింది. వాడు కంచెవార ఉన్న తుమ్మ చెట్టు నుంచి కొమ్మలు కోసి, కట్టకట్టి, పశువుల కొట్టం అంతా ఊడవసాగాడు. కొంచెం సేపటికల్లా, "చంపేస్తున్నాడురో, బాబో!" అంటూ ఆర్తనాదం వినపడింది.

పశువులకొట్టంలో పని చేసేవాడే ఒక పాలేరు, "ఆపు! ఆపు!" అంటూ కొట్టంలోకి వచ్చాడు. వాడి వీపంతా నెత్తురు ప్రవాహాలే! వర్ధకుడు ఊడ్చేది నేలనే అయినా, తుమ్మ ముళ్ళు ఆ పాలేరు వీపును దారుణంగా గీకి వదిలిపెట్టాయి.

"నీ విద్యలు నా మీద చూపిస్తావట్రా? ఒళ్ళు దగ్గిరపెట్టుకునుండు. ఇంకోసారి గిత్త జోలికి వచ్చావంటే నీ ప్రాణాలు తీస్తాను," అని పాలేరును బెదిరించాడు వర్ధకుడు.

పాలేరు కూడా కొన్ని శక్తులు కలవాడే, కాని వర్ధకుడు అంతకన్న రెండాకులు ఎక్కువ చదివినవాడు.

మరొకసారి ఇంకొక సంఘటన జరిగింది. గ్రామ పెద్దలు తమ పొలాలలో పండిన ధాన్యాన్ని బళ్ళకెత్తి బస్తీకి పంపారు. అయిదారు బళ్ళూ, పది పన్నెండుమంది మనుషులూ కలిసి బయలుదేరారు. వాళ్ళ వెంట వర్ధకుడు కూడా ఉన్నాడు. బళ్ళు మధ్యాన్నంవేళకు రోడ్డుపక్కన ఉన్న ఒక చెరువుగట్టు చేరినై. అక్కడ ఎడ్లకు నీరుపెట్టి, తాము కూడా తిండి తిని, గట్టుమీద చెట్ల కింద కూర్చుని ఆ కబురూ, ఈ కబురూ చెప్పుకోసాగారు బళ్ళవాళ్ళు.

ఉన్నట్టుండి ఒక బండివాడు, "ఆ కుక్క చూడు!" అన్నాడు.

అందరూ అటుకేసి చూసి ఆశ్చర్యపడ్డారు. ఎందుచేతనంటే ఒక కుక్క రహదారి వెంట ఒంటరిగా పరిగెత్తుకుంటూ, అటుగాని ఇటుగాని చూడకుండా వస్తున్నది.

దాని దరిదాపుల్లో ఎవరూ లేరు. సమీపంలో ఒక గ్రామం కూడా లేదు. అందుచేత అది చాలా దూరం నుంచి వస్తూండాలి. అది వెళ్ళే తీరుచూస్తే చాలా దూరం వెళ్ళేటట్టు కూడా కనిపించింది.

"కుక్క అట్లా ఒంటరిగా ప్రయాణం చెయ్యగా ఎవరన్నా, ఎప్పుడన్నా చూశారూ?" అని ఎవరో అడిగారు.

ఆ కుక్కనే రెప్పవాల్చక చూస్తున్న వర్ధకుడు, "ఆ కుక్క తానై రావటంలేదు. ఎవరో దాన్ని పంపారు," అన్నాడు.

"ఎవరు పంపుతారు? ఎందుకు పంపుతారు?" అని ఎవరో అడిగారు.

"అదే తెలుసుకోవాలి," అన్నాడు వర్ధకుడు.

వాడు ఏంచేశాడో తెలీదు. అంత వేగంగా వస్తున్న కుక్క కాస్తా చప్పున ఆగి, స్పృహ వచ్చినదానిలాగా అటూ ఇటూ చూసి, వెనక్కు తిరిగి, వచ్చిన దారినే తిరిగి వెళ్ళి పోయింది.

ఇది కూడా బళ్ళవాళ్ళకు విచిత్రంగానే ఉంది. వాళ్ళు బళ్ళకు ఎడ్లను పూన్చి ప్రయాణ మయారు.

వర్ధకుడు వాళ్ళను ఆపి, "తొందర వద్దు. ఈ కుక్క సంగతి తేల్చుకు మరీ పోదాం," అని చెప్పాడు.



ఒక అరగంట కల్లా ఒక మనిషి గుర్రం మీద దౌడుతీస్తూ కుక్క వెళ్ళిన వైపునుంచి వచ్చాడు. చెరువుగట్టున మనుషులను చూసి ఆ మనిషి గుర్రం దిగి, "నా కుక్క జోలికి వచ్చిన వాళ్ళెవరు? మీపని మీరు చూసుకోక ఇతరుల వ్యవహారాలలో ఎందుకు వేలు పెడతారు?" అని గదమాయించాడు.

"ఎవరినని అడుగుతావు? నీ కుక్క జోలికి మేమెవరమూ వెళ్ళలేదు," అన్నాడు వర్ధకుడు.

బళ్ళవాళ్ళు చాలామంది ఉండటం చూసి గుర్రం మీద వచ్చిన మనిషి కాస్త తగ్గాడు. వర్ధకుడు ఆ మనిషి చేత నిజం చెప్పించాడు. ఆ మనిషి ఒక పశువుల వైద్యుడు. ఒకటి రెండామడ మేర మరొక పశువుల వైద్యుడు లేడు. ఈ వైద్యుడికి కొన్ని శక్తులు కూడా ఉన్నాయి. ఆయన తన కుక్కను వెర్రిదానిలాగా కనపడేటట్టు చేసి, తన ఇష్టం వచ్చిన చోటికి పంపకం చెయ్యగలడు. అది ఏ మందనో చేరి ఏ పశువునో కరిచి పారిపోయి, తన యజమాని వద్దకు వచ్చేస్తుంది. పిచ్చి కుక్క కరిచిందని భయపడి వాళ్ళు ఈ పశువుల వైద్యుణ్ణి పిలిపిస్తారు. ఈయన వెళ్ళి పశువుల కుడితిలో ఏదో మందు కలిపినట్టు నటించి, "కుక్క కరిచిన పశువు చేత ఈ కుడితి తాగించండి, ఏ ప్రమాదమూ జరగదు," అని ధైర్యం చెప్పి, బోలెడంత డబ్బు పుచ్చుకుని వెళ్ళిపోతాడు. ఆ కాలంలో పిచ్చి కుక్క కాటుకు మందే లేదు. కాని ఈ పశువులను కరిచేది నిజంగా పిచ్చి కుక్క కాదు గనక పశువులకు ఏ ప్రమాదమూ ఉండేదికాదు. అయితే ఈ పశువుల వైద్యుడు మాత్రం పిచ్చికుక్క కాటుకు నమ్మకంగా చికిత్స చెయ్యగలడని ఖ్యాతి సంపాదించాడు, అంతులేని డబ్బు కూడా గడించాడు. అటువంటి పశువుల వైద్యుడి ఆట కాస్తా వర్ధకుడి మూలంగా కట్టయిపోయింది.





# కృష్ణావతారం

ఆదికాలంలో కాలనేమి అనే గొప్ప రాక్షసుడుండేవాడు. వాడికి నూరు చేతులూ, నూరు తలలూ ఉండేవి. చూడటానికి మహాభయంకరంగా, నూరు శిఖరాలు గల నల్లని పర్వతం లాగుండేవాడు. అసాధారణమైన బలానికి తోడు, వాడు తపస్సు చేసి బ్రహ్మనుంచి గొప్ప వరాలు కూడా పొంది బాగా మదించాడు.

ఆ కాలంలో దేవదానవులకు తరుచు యుద్ధాలు జరుగుతూ ఉండేవి. ఒకప్పుడు దానవులు గెలిచేవారు, ఒకప్పుడు దేవతలు గెలిచేవారు. ఒకసారి యుద్ధంలో దేవతలు ఘనవిజయం సాధించి, దానవులను తరిమికొట్టారు. అది తెలిసి కాలనేమికి మహాగ్రహం వచ్చింది. వాడు దానవనాయకు లందరినీ కూడగట్టి, వారిని యుద్ధానికి ప్రోత్సహించి, సైన్యాలను సమకూర్చుకుని, ఇంద్రుడి పైకి యుద్ధానికి వచ్చాడు. ఇంద్రుడి నాయకత్వాన దేవతలూ, కాలనేమి నాయకత్వాన దానవులూ తలపడి, మహాభయంకరంగా యుద్ధం చేశారు.

ఆ యుద్ధంలో కాలనేమి ఇంద్రుడితో బాటు మిగిలిన దిక్పాలకులను కూడా చిత్తుగా ఓడించేశాడు. మూడు లోకాలూ అతని అధీనమయాయి. విష్ణుమూర్తి దేవతలకు జరిగిన పరాభవాన్ని చూస్తూ కూడా, కాలనేమికి కాలపరిపాకం కాలేదని గ్రహించి ఏమీ చెయ్యకుండా ఊరుకున్నాడు.

కాలనేమికి మాత్రం విష్ణువును కూడా జయించాలని బుద్ధి పుట్టింది. అతను విష్ణు




మూర్తి వద్దకు వెళ్ళి, "నీవు మా మధు కైటభులను చంపావు, మా దైత్యులలో మణిలాటి హిరణ్యకశిపుణ్ణి గోళ్ళతో చీల్చి చంపావు, మా బలిని పాతాళానికి తొక్కేసి, మూడు లోకాలూ ఆక్రమించావు. మా దైత్య స్త్రీల కన్నీరుతో దేవతలనే పాలాన్ని తడిపి కాపాడావు. అందుకు పగ తీర్చుకోవటానికి వచ్చాను," అన్నాడు.

"పోతరించి కారుకూతలు కూసిన మాత్రాన నీచేత ఏమవుతుంది? శూరుడైన వాడెక్కడైనా ప్రగల్భాలాడతాడా? బ్రహ్మ ఇచ్చిన వరాల మూలాన పొగరెక్కి ఒళ్ళు తెలియని పనులు చేశావు. పూర్వం



దానవులకు పట్టిన గతే నీకు పట్టబోతుంది. నిన్ను తప్పక చంపి దేవతలకు వారివారి స్థానాలు తిరిగి ఇప్పిస్తాను," అని విష్ణుమూర్తి అన్నాడు.

ఆ మాటలు విని కాలనేమి ఉగ్రుడై, ఘోరమైన తన గదను గరుత్మంతుడికి గురి చూసి విసిరి, పెద్ద పెడబొబ్బ పెట్టాడు. అది గరుత్మంతుణ్ణి, వజ్రాయుధం కొండను తాకినట్టు తాకింది. విష్ణువు నిర్ఘాంత పోయాడు. ఆయన గరుత్మంతుడి బాధ పోగొట్టి, తన శరీరంతోబాటు గరుడుడి శరీరం కూడా పెంచి, చేతిలోకి తన సుదర్శనచక్రం తీసుకుని కాలనేమి పై విసిరాడు. అది వెళ్ళి కాలనేమి తలలనూ, చేతులనూ తరిగిపారేసింది. ఆ రాక్షసుడి శరీరం మటుకు ఇంకా అలాగే నిలబడి ఉండటం చూసి గరుత్మంతుడు తన రెక్కలు విసిరి, గాలి పుట్టించి ఆ శరీరాన్ని పడిపోయేలాగుచేశాడు. ఇది చూసి కాలనేమి అనుచరులైన రాక్షసవీరులు బెదిరి, ఎక్కడివాళ్ళక్కడ కుక్కినపేలలాగా అయిపోగా, విష్ణువు వాళ్ళను చంపేశాడు.

రాక్షసులు చావగానే బ్రహ్మ, ఇంద్రుడూ, ఇతర దేవతలూ విష్ణువును చూడవచ్చి, ఆయనను ప్రశంసించారు.



"ఇంక మీకు రాక్షస భయం ఉండదు. ఎప్పటిలాగే మీరు మీమీ లోకాలను నిశ్చింతగా ఏలుకోండి. ఇక యజ్ఞాలు నిర్విఘ్నంగా సాగుతాయి. కాని దుష్టబుద్ధులైన రాక్షసులను మాత్రం ఒక కంట కనిపెట్టి ఉండండి," అని విష్ణువు వారితో చెప్పాడు.

తరవాత ఆయన పాలసముద్రానికి వెళ్ళి, తన శేషపాన్పు పైన పడుకుని యోగనిద్రలో మునిగిపోయాడు. విష్ణువు యోగనిద్రలో ఉండగానే కృతయుగం వెళ్ళిపోయింది, త్రేతాయుగం కూడా అంతానికి వచ్చింది. ఆ సమయంలో భూదేవి ప్రజాభారం హెచ్చయిందని ఆక్రోశించింది. ఆ ఆక్రోశం విని దేవతలు బ్రహ్మ పద్దకు వెళ్ళి, బ్రహ్మను వెంటబెట్టుకుని విష్ణువును చేరి, ఆయనను యోగనిద్ర నుంచి మేల్కొలిపారు.

విష్ణువు మెల్లిగా కళ్ళు తెరిచి దేవతలను చూసి, "ఏం ఇలా వచ్చారు? మీరంతా సుఖంగా ఉన్నారు గద? లోకాలు రాక్షస బాధ లేకుండా సుఖంగా ఉన్నాయి గద?" అని కుశలప్రశ్నలు వేశాడు.

బ్రహ్మ చేతులు జోడించి, "మహానుభావా, రాజుల మధ్య ఏ విధమైన శత్రుత్వాలూ లేవు. సత్యమూ, ధర్మమూ



స్థిరంగా ఉన్నాయి. యాగాలు చక్కగా జరుగుతున్నాయి, దేవకార్యాలూ, పితృకార్యాలూ తృప్తికరంగా సాగుతున్నాయి, ఎవరికీ రోగాలూ, రొష్టులూ లేవు. మానవులు సంపూర్ణాయువు కలిగి ఉన్నారు. ఏ పట్టణం చూసినా, పల్లె చూసినా అపారమైన జనసంఖ్య కలిగి ఉన్నది. జనభారం మొయ్యలేనో అని భూదేవి ఆక్రోశిస్తున్నది. ధర్మహాని కలగకుండా ఈ భూభారాన్ని తగ్గించే ఉపాయ మేదో నీవే చూడాలి. నీవు మేరుపర్వతానికి దయచేసి, అక్కడ మా అందరికీ కర్తవ్యబోధ చెయ్యవలసిందని నా ప్రార్థన," అన్నాడు.



విష్ణువు లేచి కూర్చుని తన ఆభరణాలు చక్కజేసుకుని, బట్ట బిగించుకుని, నిల బడి, తన శంఖచక్రాది ఆయుధాలు ధరించి, గరుడవాహనారూఢుడై క్షణంలో మేరుపర్వ తానికి వచ్చాడు. ఆ పర్వతం మీద పూర్వం విశ్వకర్మ నిర్మించిన దివ్యమైన సభ ఒకటి ఉన్నది.

ఆ సభలో ఉన్నతాసనం మీద మహా విష్ణువు కూర్చున్నాడు. మిగిలిన వారంతా ఉచితాసనాలపైన కూర్చున్నారు. ఆ సభకు యక్షులూ, గంధర్వులూ, సిద్ధులూ, విద్యా ధరులూ, నాగులూ మొదలైన వారంతా కూడా వచ్చారు.

అక్కడికి భూదేవి పుట్టెడు దిగులుతో వచ్చింది. ఆమెను చూడగానే అందరూ ఒక్కసారిగా మాట్లాడారు. వాయుదేవుడు చెయ్యెత్తి ఆ కలకలమంతా వారించి, భూదేవితో ఆమె అక్కడికి వచ్చిన పని ఏదో చెప్పమన్నాడు.

"మీకు తెలియని దేమున్నది? రాజులు అపారంగా పెరిగిపోయారు. ప్రజాభారంతో కృశించిపోతున్నాను. ఈ భారం తగ్గకపోతే నేను బతకలేను. ఈ విష్ణుమూర్తి తలచు కుంటే ఈ పని జరుగుతుంది. పెద్దలు మీరంతా కూడా ఉన్నారు," అన్నది భూదేవి విచారంగా.

భూదేవి చెప్పిన ఈ మాటలు విని సభలోవాళ్ళు తమలోతాము మాట్లాడుకుని, బ్రహ్మదేవుడితో, "భూదేవి బాధ మాన్పటం మన కర్తవ్యం. నీవు పెద్దవాడవు, సృష్టి కర్తవు," అన్నారు.

అప్పుడు బ్రహ్మ లేచి సభాసదులతో ఇలా చెప్పాడు:

"ఒకనాటి సాయంకాలం నేనూ, కశ్యప మహాముని సముద్రతీరాన కూర్చుని తత్వ విచారం జరుపుతూండగా, చంద్రోదయం వేళ గంగాసంగమం చేత పొంగిన సము ద్రుడు ఆకాశమంత ఎత్తులేచి, మేము



కూర్చున్న ప్రదేశమంతా ఆక్రమించటమే గాక మమ్మల్ని కూడా తడిపాడు. నేను నవ్వుతూ, "ఇదేం పని? శాంతించు!" అన్నాను. వెంటనే సముద్రుడు శాంతించి, మానవరూపం ధరించి, గంగతో సహా మా ఎదట నిలిచాడు. అప్పుడు నేను భవిష్యత్తు గురించి ఆలోచించి, "సముద్రుడా, ఇలా రాజసం చూపావు గనక భూమిపై రాజువుగా జన్మించు. నేను చెప్పగానే శాంతించావు గనక శంతను డనే పేరుతో, ఈ గంగనే భార్యగా చేసుకుని జీవించు," అన్నాను. సముద్రుడు. నాకు నమస్కరించి, "పర్వపువేళా, గాలి ఎగ



వీచినప్పుడూ, చంద్రోదయవేళా పొంగటం నా స్వభావ లక్షణం. అందులో దుర్బుద్ధి ఏమీ లేదు. అలాటప్పుడు నన్ను శపించటం ధర్మమా?" అని దీనంగా అన్నాడు. 'నాయనా, లోకహితం కోరి నేనీ మాట అన్నాను. నీవు పవిత్రమైన భరతవంశంలో పుట్టు. ఈ గంగకు వసువులను కని, వారికి వసిష్ఠు డిచ్చిన శాపం తీర్చు. తరవాత సత్యవతి అనే ఆమెకు వంశోద్ధారకులైన కొడుకు లిద్దరిని కని జన్మ చాలించు,' అని చెప్పాను. ఆ శంతనుడి కొడుకైన విచిత్రవీర్యుడికి ధృతరాష్ట్రుడూ, పాండుడూ అనే కొడుకులు కలుగుతారు. ధృతరాష్ట్రుడికి నూరుగురు కొడుకులూ, పాండుడికి అయిదుగురు కొడుకులూ పుట్టుతారు. ఆ నూరుగురికీ, అయిదుగురికీ మధ్య రాజ్యకాంక్ష కారణంగా మహాయుద్ధం జరుగుతుంది. ఆ యుద్ధంలో భూమిపై గల రాజులందరూ నశిస్తారు. అనేక లక్షల ఏనుగులూ, గుర్రాలూ, సైనికులూ పీనుగులై పోతారు. భూభారం తగ్గిపోయి ఈ భూదేవి సుఖపడుతుంది. కలహకారకుడైన కలి అంశ ధృతరాష్ట్రుడి భార్య గర్భానా, యముడి అంశ పాండుడి భార్య గర్భానా పుట్టటం జరుగుతుంది. ఇంకా అనేకమంది



దేవముఖ్యుల అంశలు వేరువేరు మానవ జన్మలెత్తుతాయి."

బ్రహ్మ చెప్పిన ఈ మాటలు విని అందరూ ఆయనను అభినందించారు. అదే సమయంలో నారదు డా సభకు విచ్చేశాడు. ఆయన వీణ వాయిస్తూ పాట పాడి, విష్ణువునూ, దేవతలనూ రంజింపజేసి, విష్ణువుతో, "దేవా, భూమిపై గల రాజకులాన్ని నిర్మూలించటానికి ఈ దేవతలందరూ తల పెట్టిన ఈ పని నీవు పూనుకోకుండా ఎలా సఫలమవుతుంది? భూమి పైన నీ అంశ ఒకటి అవతరించాలి, మిగిలినవారి అంశలకు ఉత్సాహప్రేరణ లివ్వాలి, అప్పుడు గాని ఈ దేవకార్యం నెరవేరదు. అది అలా ఉండగా, ఈ దేవాంశలతో పుట్టేవారి కెవ్వరికీ సాధ్యంకాని పని మరొకటి ఉన్నది. దాన్ని గురించి హెచ్చరించటానికే నేనింత త్వరగా ఇక్కడికి వచ్చాను. అదేమిటంటే, దేవాసురయుద్ధంలో నీచేత చచ్చిన రాక్షసులందరూ భూమి పైన మానవజన్మ లెత్తి ఉన్నారు. రాముడి చేత రావణుడు చచ్చిన అనంతరం ఆ రాక్షసుడి మేనల్లుడూ, మధువనే వాడి కొడుకూ అయిన లవణు డనే వాడు, రాముడి ఆజ్ఞపై శత్రుఘ్నుడి చేత చంపబడ్డాడు. శత్రుఘ్నుడు అక్కడి మధువనాన్ని నిర్మూలించి, మధుర అనే పేరు



గల మహానగరం నిర్మించాడు. అక్కడ అనేక తరాల రాజులు పాలించి దాన్ని వృద్ధికి తెచ్చారు. ఇప్పుడక్కడ ఆనాటి కాలనేమి, కంసుడనే పేరుతో ఉగ్రసేను డనే భోజ వంశపురాజుకు కొడుకుగా పుట్టి ఉన్నాడు. వాడికి పూర్వజన్మ దుర్వాసన ఇంకా అలాగే ఉన్నది. వాడు తన తండ్రిని చెరలో పెట్టి, తానే రాజై కూర్చున్నాడు. ఇలాగే అనేక మంది రాక్షసులు తిరిగి భూమిపై పుట్టారు. కాలనేమి మిత్రులందరూ కంసుడికి భృత్యు లుగా పుట్టి కాళిందీతీరానా, బృందావనం లోనూ, మధురాపురం లోనూ, ఇతరచోట్లా ఉన్నారు. కొందరు రాక్షసులు ప్రాగ్జ్యోతి షంలో పుట్టి నరకాసురుడికి సహాయంగా ఉన్నారు. ఈ రాక్షసుల నందరినీ చంప టానికి నీవు మానవావతార మెత్తవలిసి ఉన్నది," అన్నాడు.

విష్ణువు ఈ మాటలు విని, బ్రహ్మ కేసి తిరిగి, "నేను అలాగే అవతార మెత్తు తాను. సృష్టికర్త నన్నెక్కడ పుట్ట మంటాడు?" అన్నాడు.

దానికి బ్రహ్మ, "వరుణుడి యజ్ఞధేను వులను కశ్యపుడు కాజేశాడు. కశ్యపుడి భార్యలైన అదితీ, సురభీ వాటిని వరుణు డికి తిరిగి ఇయ్యకుండా అడ్డపడ్డారు. వరు ణుడు నాతో ఈ సంగతి మొరపెట్టుకోగా, నేను కశ్యపుణ్ణీ, అతని భార్యలనూ మానవ జన్మ లెత్తమని శపించాను. ఆ కశ్యపుడు వసుదేవుడై పుట్టి కంసుడి ఆవులకు అధి పతిగా ఉన్నాడు. కశ్యపుడి భార్యలు దేవకీ, రోహిణీ అనేవాళ్ళుగా పుట్టి, వసు దేవుడికి భార్యలై ఉన్నారు. నీవు నీ అంశను రెండుగా విభజించి, వసుదేవుడి భార్య లిద్దరి యందూ ప్రవేశపెట్టు," అని విష్ణు మూర్తితో అన్నాడు.

విష్ణుమూర్తి తృప్తిపడి, సభ చాలించి, అందర్నీ పంపేసి, తాను తన స్వస్థానమైన పాలసముద్రానికి తిరిగివెళ్ళాడు.





# అరణ్యపురాణం

## 4

మౌగ్లీ చాలా బలాఢ్యుడుగా పెరిగాడు. ఎందుకు పెరగడూ? ఎప్పుడూ తిండి గురించి తప్ప మరి దేన్ని గురించీ ఆలో చించని ఏ పిల్లవాడైనా బలాఢ్యుడుగానే తయారవుతాడు.

"షేర్‌ఖానును మాత్రం నమ్మకు. ఏనాటికైనా వాడు నీ చేత చావాలి," అని తోడేలమ్మ మౌగ్లీకి ఒకటి రెండు సార్లు చెప్పింది. కాని మౌగ్లీ మనిషి కావటం చేత మరిచాడు. అదే తోడేలైతే మరవక పోను. కాని చిత్రమేమంటే తాను తోడేలు కానన్న భావం వాడికి లేదు.

తోడేళ్ళ నాయకుడు అకేలా వృద్ధు డవుతున్నకొద్దీ కుంటిపులి షేర్‌ఖాన్‌కు మంద లోని యువక తోడేళ్ళతో దోస్తీ బాగా జాస్తి అయింది. వాళ్ళు కబళాల కోసం పులి వెంట తిరగసాగారు. అకేలా ధైర్యంచేసి తన అధికారాన్ని పూర్తిగా అమలు చేసి నట్టయితే ఇలా జరిగిఉండకపోను. కుక్క ల్లాగా తనను ఆశ్రయించి తిరిగే యువక తోడేళ్ళను మాటలతో ఉబ్బేసి, అంత చక్కని మందును ఒక ముసలితోడేలూ, ఒక మనిషి కూనా నడపటమేమి టనేవాడు, షేర్‌ఖాన్. "సమావేశాలప్పుడు మీలో ఎవరూ వాడి కళ్ళ కేసి చూడలేరని విన్నాను," అనే వాడు. యువక తోడేళ్ళు అవమానంతో గుర్రుపెట్టే వాళ్ళు.

బాఘీరకు అంతటా కళ్ళే, అంతటా చెవులే. అతనికి ఈ సంగతి తెలియ వచ్చింది. అతను మౌగ్లీతో, "షేర్‌ఖాన్ ఎప్పుడో నిన్ను చంపేస్తాడు," అని హెచ్చ రించాడు. కాని మౌగ్లీ నవ్వి, "నాకు మంద ఉన్నది, నువు ఉన్నావు. భాలూ ఉన్నాడు- ఆయన మహాబద్ధకస్తుడే అయినా, నా కోసం

అట్ట చివరి బొమ్మ



చెయ్యిచేసుకోక పోడు. నే నెందుకు భయ పడాలి?" అని అడిగాడు.

"షేర్‌ఖాన్ నీ శత్రువని ఎన్నిసార్లు చెప్పాను?" అన్నాడు బాఘీర.

"ఆ చెట్టు మీద ఎన్ని కొబ్బరికాయ లున్నాయో అన్ని సార్లు చెప్పావు. చెబితే చెప్పావులే, బాఘీరా! నాకు నిద్రవస్తోంది. ఆ షేర్‌ఖాన్‌కు పెద్ద తోకా, పెద్ద గొంతూ తప్ప ఇంకేమీ లేదు," అన్నాడు మౌగ్లీ.

"నిద్ర ఇదా సమయం? ఈ సంగతి భాలూకు తెలుసు, నాకు తెలుసు, మంద కంతకూ తెలుసు, తబకీ కూడా నీకు చెప్పాడు," అన్నాడు బాఘీర.



"అహహ్హా! ఆ తబకీగాడు ఈ మధ్య నా దగ్గిరికొచ్చి, నేను మనిషికూన ననీ, నాకు వేరుశనగకాయలు తవ్వటం కూడా చాతకాదనీ వదిరాడు. వాడికి కాస్త మర్యాద నేర్పుదా మని, జల్లితోక పట్టుకుని, కొబ్బరి చెట్టు కేసి రెండు ఉతుకులు ఉతికాను," అన్నాడు మౌగ్లీ.

"అదే పొరబాటు! తబకీ తంపులు పెట్టేవాడే అయినా, నీకు అవసరమైన విషయాలు కొన్ని చెప్పి ఉండేవాడు. కాస్త కళ్ళు తెరు తమ్ముడూ. షేర్‌ఖాన్‌కు నిన్ను అరణ్యంలో చంపటానికి దమ్ములేదు. కాని, మరిచిపోకు, అకేలా చాలా వృద్ధు. అతను లేడిని కొట్టలేని రోజు త్వరలోనే వస్తుంది. నిన్ను మొదటిసారి సమావేశానికి తెచ్చి నప్పుడు చూసిన తోడేళ్ళందరూ ముసలివా ళ్ళయారు. చిన్నకారు తోడేళ్ళకు షేర్‌ఖాన్ మాటలంటే గురి. మనిషికూనకు మందలో స్థానం లేదని వాడు వాళ్ళకు నూరిపోశాడు. త్వరలోనే నువు మనిషివి కాబోతున్నావు," అన్నాడు బాఘీర.

"మనిషి అయితే తన సహోదరులతో కలిసి పరిగెత్తరాదా? నేను అరణ్యంలో పుట్టాను. అరణ్యశాసనాలను శిరసావహిం చాను. నా చేత కాలిముళ్ళు పీకించుకోని



తోడేలు లేదు. అందరూ నా సోదరులేనే!" అన్నాడు మౌగ్లీ.

బాఘీర తన శరీరాన్ని నిగడ చాచి పడుకుని, కళ్ళు అరమోడ్చి, "తమ్ముడూ, నా దవడ కింద తడివి చూడు," అన్నాడు.

మౌగ్లీ తడివి చూసి ఒకచోట బొచ్చులేని మేర ఉండటం గ్రహించాడు.

"నా వంటిన ఆ మెడపట్టీ గుర్తున్న సంగతి అరణ్యంలో ఒక్క పురుగుకైనా తెలియదు. తమ్ముడూ, నేను మనుషుల మధ్య పుట్టాను. మా అమ్మ మనుషుల మధ్య—ఉదయపూరు రాజభవనంలో ఉండే బోనులో—ప్రాణాలు వదిలింది. అందుకే నువు పసికూనగా ఉన్నప్పుడు నీకు వెల ఇచ్చి కొన్నాను. నేను మనుషుల మధ్యనే పుట్టాను. నాకు అరణ్యం తెలీదు. నన్ను కటకటాలలో ఉంచి, ఇనప బొచ్చెలో తిండి అందించేవారు. ఒకనాటి రాత్రి నాకు బాఘీర ననే భావం బలంగా కలిగింది, నేను మనుషుల ఆటవస్తువును కాననిపించింది. ఒక్క పంజా వేటుతో వెధవతాళాన్ని విరగ్గొట్టి, వచ్చేశాను. నాకు మనుషుల పద్ధతులు తెలుసు కనకనే అరణ్యంలో షేర్‌ఖాన్ కన్న భయంకరుణ్ణిగా తిరగగలుగుతున్నాను," అన్నాడు బాఘీర.



"అవును. ఒక్క మౌగ్లీకి తప్పిస్తే అరణ్యంలో అందరికీ బాఘీర అంటే హడల్," అన్నాడు మౌగ్లీ.

నేను అరణ్యానికి తిరిగివచ్చినట్టే, నువు చివరకు మనుషుల మధ్యకు తిరిగి పోతావు—ఈలోపల సమావేశంలో నువు చావకుండా ఉంటే," అన్నాడు బాఘీర.

"దేనికి ? ఎవరికిగాని నన్ను చంపాలని ఎందు కనిపించాలి ?" అన్నాడు మౌగ్లీ.

"నాకేసి చూడు," అన్నాడు బాఘీర.

మౌగ్లీ బాఘీర కళ్ళకేసి తేరి పారచూశాడు. నల్లచిరుత తల పక్కకు తిప్పేసుకుని, "అందుకే! మనుషుల మధ్య పెరిగిన నేనే

నీ కళ్ళలోకి చూడలేను. నువంటే నాకు అపేక్ష, తమ్ముడూ. కాని మిగిలినవాళ్ళకు ఈర్ష్య. ఎందుకంటే, వాళ్ళు నీ కళ్ళలోకి చూడలేరు, నువు తెలివిగలవాడివి, వాళ్ళ కాళ్ళలో గుచ్చుకున్న ముళ్ళు లాగిపెట్టావు. అన్నిటినీ మించి నువు మనిషివి," అన్నాడు. మౌగ్లీకి ఈ విషయాలేవీ తెలీవు.

"కొట్టి మరీ మాట్లాడటం అరణ్యపు అనవాయితీ. నీ నిర్లక్ష్యాన్నిబట్టే నువు మనిషివని వాటికి తెలుస్తుంది. నాకేమని పిస్తున్నదంటే, అకేలా ఈసారి జింకను పట్టలేకపోయిన తరవాత కొండ మీద సభ చేస్తారు—ఆ తరవాత—ఉండు, నాకు తట్టింది! నువు వెంటనే లోయలోకి దిగి పోయి, మనుషుల గుడిసెల నుంచి ఎర్ర పువ్వు పట్టుకురా!" అన్నాడు బాఘీర.

బాఘీర ఎర్రపువ్వు అన్నది నిప్పు. అరణ్యంలో ఉండే ఏ ప్రాణీ నిప్పును నిప్పు అని పిలవదు. ప్రతి ప్రాణికీ అదంటే హడలు, అందుచేత దాన్ని అనేక పేర్లతో పిలుస్తారు. "చీకటిపడేటప్పుడు గుడిసెల బయట పూసే ఎర్రపువ్వేనా? తీసు కొస్తాను," అన్నాడు మౌగ్లీ.

"మనిషికూన అనదగిన మాట అన్నావు! అది చిన్న పిడతలలో పెరుగుతుంది, జ్ఞాపకం ఉంచుకో. ఒక పిడతతెచ్చి దగ్గిర పెట్టు కున్నావంటే అవసరానికి పనికొస్తుంది," అన్నాడు బాఘీర.

మౌగ్లీ బాఘీర మెడచుట్టూ ప్రేమగా చెయ్యివేసి, ముఖంలోకి చూస్తూ, "ఇదంతా షేర్‌ఖాన్‌గాడి పనేనంటావా, బాఘీరా?" అని అడిగాడు.

"నేను పగలగొట్టిన తాళం తోడు!" అన్నాడు బాఘీర.

"ఇందుకు వడ్డీతో సహా షేర్‌ఖాన్‌గాడికి అప్పుజెప్పి తీరుతాను, నన్నుకొన్న ఎద్దు తోడు!" అంటూ మౌగ్లీ బయలుదేరాడు.

—(ఇంకా వుంది)



# 58. రోమను నీటితూములు

సెగోవియా (స్పెయిను) లోని ఈ నీటితూములు (అక్విడక్టు) 2 వేల ఏళ్ళనాటిది. రాతికి రాతికి మధ్య సున్నంగానీ, సిమెంటుగానీ లేకుండా ఈ అక్విడక్టు నిర్మించబడింది. ఇటీవలి దాకా ఈ తూములలో నీరు పారుతూనే ఉండేది. ఆర్చీల మధ్యగా సెగోవియా కెథీడ్రల్ కనిపిస్తున్నది.



**Photo by Ranbir A. L. Syed**



బహుమతి
పొందిన వ్యాఖ్య

చిట్టిరాజు సిద్ధమయ్యేడు యుద్ధానికి

పంపినవారు :
ఎస్. సి. రావు, మకుట్రప

Photo by Devidas Kasbekar



బహుమతి
పొందిన వ్యాఖ్య

పొట్టిఅవధాని పెట్టిన ముహూర్తానికి

పంపినవారు:
ఎస్. సి. రావు, మక్కువ

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1966 నవంబర్ నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ సెప్టెంబర్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : చిట్టిరాజు సిద్ధమయ్యేడు యుద్ధానికి

రెండవ ఫోటో : పొట్టిఅవధాని పెట్టిస ముహూర్తానికి

పంపినవారు : ఎస్. చలపతిరావు,

ముక్కువ. (శ్రీకాకుళం జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at The B. N. K. Press Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# పూర్తి చిరునామా వ్రాయడంవల్ల ఉత్తరాలు తొందరగా చేరుతాయి.

చిరునామాను
అసంపూర్తిగా వ్రాయడంవల్ల
ఉత్తరాలు
ఆలస్యంగా చేరుతాయి.



మీకు ఇంకా బాగా సేవచేయడానికి మాకు సహాయపడండి
భారత తపాల తంతి శాఖ

DA-66/284

# దిలీప్ బృందం చేపల వేట




హాయ్, హాయ్!
ఇవాళ స్కూలులేదు!


మనమేంచేద్దాం దిలీప్?
చేపలు పట్టడానికి వెళ్దాం!
అద్భుతమైన ఊహరా!


నా దగ్గర దారం, కొక్కెం వుంది.
ఆ కర్రను బెత్తంగా వాడుదాం!
ఇదిగో 10 పైసాలు చేపలకు ఎర పురుగులు కొనడానికి.


దిలీప్, ఇదే ఆఖరు పురుగు. ఒక్క చేపకూడా పడలేదు.
పురుగులకోసం వెతుకుదాం రండి.
కానీ, పురుగులు పచ్చగడ్డిలో దాక్కొనివుంటాయే!
చీకటిపడ్తోంది. ఎలారా!


నా 'ఎవరెడి' టార్చితో వాటికోసం వెతుకుదాం.
చూడ్రా. ఓ వానపాము దొరికింది-ఇక్కడ రెండు, అదిగో మూడు!


ఇప్పుడు నా వంతు చేపలు పట్టడం.


నిజంగా అదృష్టమేరా—
'ఎవరెడి' కూడా తోడ్పడింది.







నాన్నా, నీ సొమ్ము
బ్యాంకులో పెరుగుతుందని
చెప్పావు! ఎలా పెరుగుతుంది
నాన్నా?

# కొత్తది! చారలు గల టూత్‌పేస్టు!




# సిగ్నల్

## క్రిమినిరోధక ఎఱ్ఱ చారలు గలది*
## మీ నోరంతటినీ శుభ్రంగా వుంచుతుంది!

❶ మీ పళ్లను శుభ్రపరుస్తుంది ❷ మీ నోటి ఊపిరిని తాజాగా వుంచుతుంది

* ఎఱ్ఱచారల్లో హెక్సాక్లోరాఫీన్ వున్నది

క్రిమినిరోధక ఎఱ్ఱచారలుగల సిగ్నల్ టూత్‌పేస్టు మీ నోరంతటినీ శుభ్రంగా వుంచుతుంది! ఎఱ్ఱచారలందు హెక్సాక్లోరాఫీన్ గలదు. సిగ్నల్ మీ పళ్లను శుభ్రపరుస్తుండగా.........చారలలోని హెక్సాక్లోరాఫీన్ మీ నోటి ఊపిరిని తాజాగా వుంచుతుంది. ఎందుచేతనంటే హెక్సాక్లోరాఫీన్ నోటి దుర్గంధమును కలిగించే క్రిములను తక్షణం నిర్మూలించే సురక్షిత పదార్థం. ఆశ్చర్యంకాదు. సిగ్నల్ మీ నోరంతటినీ పరిశుభ్రంగా వుంచుతుంది. సిగ్నల్ యందలి ఎఱ్ఱచారలు, బుడగల నురగ తాజా పిప్పరమెంటువంటి రుచి, కుటుంబములో అందరికీ ప్రీతి. నేడే సిగ్నల్ టూత్‌పేస్టు కొనండి.




...సిగ్నల్ మీ పళ్లను మరియు నోటి ఊపిరిని శుభ్రపరుస్తుంది.

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ యొక్క విశిష్టమైన ఉత్పత్తి

లింటాస్-SG.2A-77 TL

